సోవియట్ పార్టీ లేఖకు

# చైనా కమ్యూనిస్టు పార్టీ జవాబు

( 14 జూన్ 1963 )




మార్క్సిస్టు ప్రచురణలు - తెనాలి.

1

సోవియట్ పార్టీ లేఖకు

# చైనా కమ్యూనిస్టు పార్టీ జవాబు

( 14 జూన్ 1963 )




మార్క్సిస్టు ప్రచురణలు - తెనాలి.

# 1

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ మార్చి 30వ తేదీన వ్రాసిన లేఖకు చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ జూన్ 14వ తేదీన జవాబు ఇచ్చింది. "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సాధారణ పంథాకు సంబంధించిన ప్రతిపాదన" అనే శీర్షికక్రింద పీపుల్స్ డెయిలీ జూన్ 17వ తేదీన ఆ జవాబును ప్రచురించింది. జూన్ 15వ తేదీన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటికి అందజేయబడిన ఆజవాబు పూర్తిపాఠం ఇది.

జూన్ 14. 1963

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీకి, ప్రియమైన కామ్రేడ్స్!

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటి 1963 మార్చి 30వ తేదీన వ్రాసిన లేఖను చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటి పరిశీలించింది.

సోషలిస్టు శిబిరం విషయంలో, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ విషయంలో ఐక్యతను కోరేవారందరూ చైనా, సోవియట్ పార్టీలమధ్య సంప్రదింపులను గూర్చి హృదయపూర్వకమైన, గాఢమైన జిజ్ఞాసను కనబరుస్తున్నారు. అభిప్రాయ భేదాలను తొలగించుకోవడానికి, ఐక్యతను పటిష్ఠవంతం చేసుకోవడానికి, అన్ని కమ్యూనిస్టు, వర్కర్సుపార్టీల ప్రతినిధులతో సమావేశాన్ని ఏర్పరచడానికై తగు పరిస్థితులను కల్పించడానికి మన సంప్రదింపులు తోడ్పడ గలవని ఆశిస్తున్నారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క ఐక్యతను నిలబెట్టుకోవడం, పటిష్ఠవంతం చేసుకోవడం అన్ని దేశాల కమ్యూనిస్టు, వర్కర్సుపార్టీల సమిష్టికర్తవ్యం, పవిత్ర కర్తవ్యం. యావత్తు సోషలిస్టుశిబిరాన్ని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఐక్యపరచే విషయంలో చైనా, సోవియట్ పార్టీలకు గురుతరమైన బాధ్యత ఉంది. అవి అందుకు తగినట్లుగానే తీవ్రమైన కృషి సలపాలి.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో నేడు సిద్ధాంతానికి సంబంధించిన ప్రధాన భేదాభిప్రాయాలు అనేకం ఉన్నాయి అయితే ఈ భేదాభిప్రాయాలు ఎంత తీవ్రమైనవి అయినప్పటికి, వీటిని తొలగించుకోవడానికి మనం తగినంత ఓరిమి వహించవలసిఉంది, మార్గాలు అన్వేషించవలసివుంది. అలా జరిగినప్పుడే మనశక్తులను కూడదీసుకొని, మనఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా పోరాటాన్ని పటిష్ఠవంతం చేసుకోగలం.

ఇలాంటి హృదయపూర్వకమైన ఆకాంక్షతోటే చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ చైనా సోవియట్ పార్టీల మధ్య జరుగనున్న సంప్రదింపులకు సిద్ధమవుతుంది.

సోవియట్ యూనియన్‌కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ మార్చి 30వ తేదీన వ్రాసిన లేఖలో, చైనా సోవియట్ పార్టీలమధ్య సంప్రదింపులతరుణంలో చర్చించవలసిన సమస్యలను గూర్చి తన దృక్పథాన్ని ఒక పద్ధతి ప్రకారమే ఎదుట పెట్టింది. ముఖ్యంగాఅంతర్జాతీయకమ్యూనిస్టుఉద్యమ సాధారణ

పంథాకు సంబంధించిన సమస్యను లేవదీసింది. ఈలేఖలో మేముకూడఅంతర్జాతీయకమ్యూనిస్టుఉద్యమ సాధారణపంథాను గూర్చి, అందుకుసంబంధించినకొన్నిసిద్ధాంతసమస్యలనుగూర్చి మాదృక్పథాన్ని వెల్లడించదలచుకొన్నాం.

మన ఉభయ పార్టీలు ఒకరినొకరు అవగాహన చేసుకోవడానికి, సంప్రతింపుల తరుణంలో వివరంగా, ఒక అంశం తర్వాత మరో అంశం చర్చించడానికి మేమువెల్లడించిన దృక్పథం తోడ్పడగలదని ఆశిస్తున్నాము.

సోదర పార్టీలు మా దృక్పథాన్ని అవగాహన చేసుకోవడానికి, సోదరపార్టీలఅంతర్జాతీయసమావేశంలో ఒకరి అభిప్రాయాలుఒకరికి పూర్తిగా తెలువుకోవడానికి ఇదితోడ్పడగలదనికూడా మేము ఆశిస్తున్నాము.

(1) శ్రామికవర్గంయొక్క చరిత్రాత్మకమైన ప్రయోజనాన్నిగూర్చి మార్క్సిస్టు-లెనినిస్టు విప్లవ సిద్ధాంతాన్ని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణ పంథా తనకు మార్గదర్శకమైన సిద్ధాంతంగా లెక్కించాలి. దానినుండి వేరు కాకూడదు.

1957, 1960 మాస్కోసమావేశాలు ఒకరిఅభిప్రాయాలు ఒకరికి పూర్తిగా తెలుపుకొన్న తర్వాతనే ప్రకటనను, పత్రాన్ని ఆమోదించాయి. సంప్రదింపులద్వారా ఏకాభిప్రాయాన్ని సాధించాలన్న సూత్రానికి అనుగుణంగానే ఆవిధంగా జరిగింది. ఆ రెండు పత్రాలు మన యుగలక్షణా

లను, సోషలిస్టు విప్లవంయొక్క ఉమ్మడి సూత్రాలను పేర్కొం టున్నాయి. అన్ని కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీలకు ఉమ్మడి పంథాను సూచిస్తున్నాయి. అవి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ఉమ్మడి కార్యక్రమము.

1957 ప్రకటన, 1960 పత్రాలను అవగాహన చేసు కొనే విషయంలోనేమి, వాటిపట్ల తీసుకోవలసిన వైఖరి విష యంలోనేమి కొద్ది సంవత్సరాలుగా అంతర్జాతీయ కమ్యూ నిస్టు ఉద్యమంలో భేదాభిప్రాయాలు ఉన్నమాట నిజమే. ప్రకటన, పత్రాలలోని విప్లవ సూత్రాలను అంగీకరించడమా లేదా అనేదే ఇక్కడ ప్రధానమైన సమస్య. గత పరిశీలనలో, మార్క్సిజం – లెనినిజంయొక్క విశ్వజనీన సత్యాన్ని అంగీక రించడమా లేదా అనేది సమస్య. అక్టోబరు విప్లవంయొక్క విశ్వజనీన ప్రాధాన్యతను గుర్తించడమాలేదా అనేది సమస్య. ప్రపంచ జనాభాలో మూడింట రెండు వంతుల ప్రజలు నేటికీ సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ వ్యవస్థకింద జీవిస్తు న్నారు. వారు విప్లవం లేవదీయవలసి ఉందనే వాస్తవాన్ని అంగీకరించడమా లేదా అనేది సమస్య. ప్రపంచ జనాభాలో మూడింట ఒకవంతుగా ఉంటూ, ఇప్పటికే సోషలిస్టు మార్గంలో పయనిస్తున్న ప్రజలు తమ విప్లవాన్ని చివరికంటా కొనసాగించవలసి ఉందనే వాస్తవాన్ని అంగీకరించడమా లేదా అనేది సమస్య.

1957 ప్రకటన, 1960 పత్రంలోపొందు పరచిన విప్లవ సూత్రాలను నిశ్చిత బుద్ధితో కాపాడుకోవడం నేడుఅంత

ర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క అత్యవసరమైన, ప్రధాన మైన కర్తవ్యంగా తయారైంది.

మార్క్సిజం లెనినిజం యొక్క విప్లవ బోధలను, అక్టోబరు విప్లవంయొక్క సాధారణ పంథాను ఖచ్చితంగా అనుసరించడం ద్వారానే ప్రకటన, పత్రంలోని విప్లవ సూత్రాలను సరిగా అవగాహన చేసుకోవడానికి, వాటిపట్ల సరి అయిన వైఖరి అవలంబించడానికి వీలు అవుతుంది.

(2) ప్రకటన పత్రంలోని విప్లవ సూత్రాలు ఏవి? వాటిని ఈదిగువ విధంగా క్లుప్తీకరించవచ్చు:

అన్ని దేశాలకార్మికులారా, ఏకంకండి! ప్రపంచ కార్మికులారా, పడిత ప్రజలతో, పీడిత జాతులతో ఏకంకండి; అన్ని దేశాలలోను సామ్రాజ్యవాదాన్ని, అభివృద్ధి నిరోధక శక్తులను ఎదిరించండి; ప్రపంచశాంతి, జాతీయవిముక్తి, ప్రజాస్వామ్యం, సోషలిజాలకోసం కృషిచేయండి, సోష లిస్టు శిబిరాన్ని దృఢతరం, విస్తృతము చేయండి; శ్రామిక వర్గ ప్రపంచవిప్లవం క్రమక్రమంగా సంపూర్ణవిజయం పొందేట్లు చేయండి; సామ్రాజ్యవాదమూ, పెట్టుబడిదారి విధానమూ, మానవునిమానవుడు దోచుకొనే పద్ధతిలేనినూతన ప్రపంచాన్ని స్థాపించండి.

ఇది నేటిదశలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్య మం యొక్క సాధారణ పంథా అని మా అభిప్రాయం.

(3) ప్రపంచ వాస్తవ పరిస్థితిని మొత్తంగా గమనించి

నప్పుడు, సమకాలిక ప్రపంచంలో మౌలిక వైరుధ్యాలను వర్గదృష్ట్యా పరిశీలించినపుడు ఈసాధారణ పంథా రూపొందు తుంది. అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచ వ్యాప్తంగా పన్నిన విప్లవప్రతీఘాతవ్యూహానికి వ్యతిరేకంగా ఇవి ఉద్దే శింప బడింది.

ఈ సాధారణపంథా విస్తృతమైన ఐక్యసంఘటనను ఏర్పాటు చేసేదిగా ఉంటుంది. సోషలిస్టు శిబిరం, అంత ర్జాతీయం శ్రామికవర్గం దీనికి మూలకందంగా ఉంటాయి. అమెరికా నాయకత్వానగల సామ్రాజ్యవాదులను, అభివృద్ధి నిరోధకులను వ్యతిరేకించడం దీనిఉద్దేశం. ప్రజానీకాన్ని పెద్దఎత్తున కదలించే పంథాయిది. విప్లవ శక్తులను విస్తృత పరచే పంథాయిది. మధ్యమ శక్తులను తనవైపుఆకర్షిస్తూ, అభివృద్ధి నిరోధకశక్తులను వేరుపరచే పంథాయిది.

ఈ సాధారణపంథా అన్ని దేశాల ప్రజలు స్థిరసంకల్ప ముతో విప్లవ పోరాటం నడిపేదిగా, శ్రామికవర్గ ప్రపంచ విప్లవాన్ని చివరికంటా తీసుకుపోయేదిగా ఉంటుంది. మిక్కిలి నైపుణ్యంతో సామ్రాజ్యవాదాన్నిరూపుమాపి, ప్రపంచ శాంతిని పరిరక్షించేపంథా ఇది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సాధా రణ పంథాను ఏకపక్షంగా "శాంతియుత సహజీవనం", "శాంతియుత పోటీ", "శాంతియుత పరివర్తన" ల కిందికి దిగజార్చడమంటే, 1957 ప్రకటనను, 1960 పత్రంలోని విప్లవసూత్రాలను ఉల్లంఘించడమే అవుతుంది. శ్రామికవర్గ

ప్రపంచ విప్లవంయొక్క చరిత్రాత్మక ప్రయోజనానికి తిలోదకా లివ్వడమే అవుతుంది. మార్క్సిజం - లెనినిజం యొక్క విప్లవ బోధనల నుండి దూరంకావడమే అవుతుంది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సాధారణ పంథా ప్రపంచ చారిత్రక పరిణామంయొక్క సాధారణ నియమాన్ని ప్రతిబింబించాలి. వివిధ దేశాలలోని శ్రామిక వర్గంయొక్క, ప్రజలయొక్క విప్లవ పోరాటాలు వేర్వేరు దశలలో సాగుతాయి. వాటన్నిటికీ ప్రత్యేక స్వరూప స్వభావాలు ఉంటాయి. అయితే అవి ప్రపంచ చారిత్రిక పరిణామం యొక్క సాధారణ నియమాన్ని దాటిపోలేవు. సాధారణ పంథా అన్నిదేశాల శ్రామికవర్గంయొక్క, ప్రజలయొక్క విప్లవ పోరాటాలకు మౌలికమైన మార్గాన్ని చూపెట్టాలి.

ప్రతి కమ్యూనిస్టు, లేక వర్కర్సు పార్టీ తన నిర్దిష్టమైన పంథాను, విధానాలను రూపొందించుకొంటూనే, తన స్వదేశంలో నిర్దిష్టమైన విప్లవాచరణతోను, నిర్మాణంతోను మార్క్సిజం-లెనినిజంయొక్క విశ్వజనీన సత్యాన్ని జోడించి చూచే సూత్రానికి కట్టుబడటం చాలా అవసరం.

(4) అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సాధారణ పంథాను నిర్వచించడంలో, మొత్తంమీద ప్రపంచ రాజకీయాలు, ఆర్థిక పరిస్థితులను, ప్రపంచ వాస్తవిక పరిస్థితులను, అంటే సమకాలిక ప్రపంచంలో ప్రధానమైన వైరుధ్యాలను నిర్దిష్టవర్గ పరిశీలన చేయడంతో ప్రారంభించాలి.

నిర్దిష్ట వర్గపరిశీలనను వదిలిపెడితే, ఒకవిధంగా శూన్యంలో తడవులాడుకొన్నట్లు అవుతుంది. స్వీయమానసికమైన, నిరాధారమైన నిర్ణయాలు చేయబడతాయి. అందుచేత, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సాధారణ పంథాను గూర్చి సరిఅయిన నిర్ణయాలకు రాలేక పోవడం అటుంచి, మార్క్సిజం-లెనినిజానికి పూర్తి భిన్నమైన దారి తొక్కడం అనివార్యమవుతుంది.

సమకాలిక ప్రపంచంలో ప్రధానమైన వైరుధ్యాలు ఏవి? మార్క్సిస్టు లెనినిస్టులు నిలకడగా లెక్కించే వైరుధ్యాలు ఇవి.

సోషలిస్టు శిబిరానికి, సామ్రాజ్యవాద శిబిరానికి మధ్య వైరుధ్యం;

పెట్టుబడి దారీ దేశాలలో శ్రామికవర్గానికి, బూర్జువా వర్గానికి మధ్య వైరుధ్యం;

పీడితజాతులకు. సామ్రాజ్యవాదానికి మధ్యవైరుధ్యం;

సామ్రాజ్యవాద దేశాలమధ్య, గుత్తపెట్టుబడిదారీ గ్రూపులమధ్య వైరుధ్యాలు.

సోషలిస్టు శిబిరానికి, సామ్రాజ్యవాద శిబిరానికి మధ్య వైరుధ్యం మౌలికంగానే భిన్నమైన రెండు సామాజిక వ్యవస్థలు, అంటే సోషలిజం, పెట్టుబడిదారీ విధానం మధ్య వైరుధ్యం. ఇది నిస్సందేహంగానే చాలా తీవ్రంగా ఉంది. అయితే మార్క్సిస్టు-లెనినిస్టులు ప్రపంచంలోని వైరుధ్యాలను

కేవలం సోషలిస్టు శిబిరం, సామ్రాజ్యవాద శిబిరం మధ్య ఉన్న వైరుధ్యంగా మాత్రమే లెక్కించకూడదు.

అంతర్జాతీయ శక్తుల బలాబలాలలో మార్పువచ్చింది. ఇది సోషలిజానికి, ప్రపంచంలోని పీడిత ప్రజలందరికి, పీడిత దేశాలన్నిటికి చాలా అనుకూలంగాను, సామ్రాజ్యవాదానికి, అన్ని దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులకు చాలా అననుకూలంగాను తయూరైంది. అయినప్పటికి, పైన పేర్కొన్న వైరుధ్యాలు వస్తుతః నేటికీ ఉన్నాయి.

ఈవైరుధ్యాలు, తత్ఫలితంగా ఏర్పడే పోరాటాలు అవినాభావసంబంధం కలిగి, ఒకదానినొకటి ప్రభావితం చేస్తాయి. ఈప్రధానమైన వైరుధ్యాలలో ఏఒక్కదానినికాని ఏదీ తుడిచివేయజాలదు. లేదా స్వకీయాత్మకంగా తక్కిన అన్నిటి స్థానంలో ఏఒక్కదానినికాని నిలబెట్ట జాలదు.

ఈ వైరుధ్యాలు ప్రజావిప్లవాలకు దారి తీయడం అనివార్యం. ప్రజావిప్లవాలు మాత్రమే వీటిని పరిష్కరించ గలవు.

(5) సమకాలిక ప్రపంచంలో ప్రధానమైన వైరుధ్యాల సమస్యపై, ఈ దిగువ పేర్కొన్న తప్పు దృక్పథాలను విడనాడ వలసిఉంది.

అ) సోషలిస్టు, సామ్రాజ్యవాద శిబిరాల మధ్య వైరుధ్యంలో, వర్గవిషయాన్ని తుడిచివేస్తున్న దృక్పథం (శ్రామికవర్గ నియంతృత్వం కిందగల దేశాలకు, గుత్త పెట్టుబడి దారీ నియంతృత్వం కిందగల దేశాలకు మధ్యగలదిగా ఈ వైరుధ్యాన్ని చూడటంలో విఫలమవుతున్న దృక్పథం.

ఆ) సోషలిస్టు సామ్రాజ్యవాద శిబిరాల మధ్య వైరుధ్యాన్ని మాత్రమే గుర్తిస్తున్న దృక్పథం మరోవైపున పెట్టుబడి దారీ ప్రపంచంలో శ్రామికవర్గానికి, బూర్జువా వర్గానికి మధ్య, పీడితజాతులకు, సామ్రాజ్యవాదానికి మధ్య గల వైరుధ్యాలను, వీటి ఫలితంగా జరిగే పోరాటాలను ఇది నిర్లక్ష్యమైనా చేస్తుంది, తక్కువ అంచనా అయినా వేస్తుంది.

ఇ) పెట్టుబడి దారీ ప్రపంచానికి సంబంధించి, ప్రతి దేశంలోను శ్రామికవర్గానికి, బూర్జువా వర్గానికి మధ్యగల వైరుధ్యాన్ని శ్రామికవర్గ విప్లవం లేకుండానే పరిష్కరించ వచ్చునని, పీడితజాతులకు, సామ్రాజ్యవాదానికి మధ్యగల వైరుధ్యాన్ని విప్లవం లేకుండానే పరిష్కరించుకోగలవని వాదించే దృక్పథం.

ఈ) సమకాలిక ప్రపంచంలో పొడుగొన్న వైరుధ్యాలు ఒక నూతన పరిస్థితికి దారితీయడం అనివార్యమని, సామ్రాజ్య వాద దేశాలు ఒక తీవ్రపోరాటంలో బంధింపబడిన పరిస్థితి ఇది అనే విషయాన్ని నిరాకరిస్తూ, "బడా గుత్త పెట్టుబడి దారీ వర్గాలమధ్య అంతర్జాతీయ ఒప్పందాల" ద్వారా సామ్రాజ్యవాద దేశాల మధ్య వైరుధ్యాలకు రాజీ కుదర గలదని, లేదా రూపుమాప బడగలవని బల్లగుద్దినట్లు చెప్పే దృక్పథం.

ఉ) సోషలిజం, పెట్టుబడి దారీ విధానం అనే రెండు ప్రపంచ వ్యవస్థల మధ్యగల వైరుధ్యం "ఆర్థిక పోటీ" దశలో తనకు తానే అదృశ్యమై పోతుందని, ఈ రెండు వ్యవస్థల మధ్యగల వైరుధ్యం అదృశ్యం కావడంతో ప్రపంచములో

ప్రధానమైన ఇతర వైరుధ్యాలు కూడ ఆ విధంగానే అవుతా యని, "యుద్ధాలు లేని ప్రపంచం" "సమగ్ర సహకారం" గల ఒక నూతన ప్రపంచం ఆవిర్భవించగలదని వాదించే దృక్పథం.

ఈ తప్పు దృక్పథాలు తప్పువిధానాలకు, హానికర మైన విధానాలకు తప్పని సరిగ దారితీస్తాయనేది, ఈ విధంగా ప్రజానీకానికి, సోషలిజానికి ఏదోరకమైన అపజయాలు, నష్టాలు కలుగుతాయనేది స్పష్టం.

(6) ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్య వాదం, సోషలిజాల మధ్య బలాబలాలలో మౌలికమైన మార్పువచ్చింది. ఈమార్పు ముఖ్యంగా ఎక్కడ కనిపిస్తుం దంటే: ఇప్పుడు ప్రపంచంలో ఒక్క సోషలిస్టు దేశమే కాదు బలోపేతమైన సోషలిస్టు శిబిరంగా ఏర్పడ్డ అనేక సోషలిస్టు దేశాలు ఉన్నాయి. ఇప్పుడు సోషలిస్టు పంథాను చేబట్టిన ప్రజలసంఖ్య ఇరవై కోట్లుకాదు. వందకోట్లు లేదా ప్రపంచ జనాభాలో మూడోవంతుగావుంది.

అంతర్జాతీయ శ్రామికవర్గము, కార్మిక ప్రజానీకము నడిపిన పోరాటాల ఫలితమే సోషలిస్టు శిబిరం. అది అంతర్జా తీయ శ్రామికవర్గానికి, కార్మిక ప్రజానీకానికి, అదే విధంగా సోషలిస్టు దేశాలలోని ప్రజానీకానికి చెందుతుంది.

సోషలిస్టు దేశంలోని ప్రజలయొక్క అంతర్జాతీయ శ్రామికవర్గంయొక్క కార్మికప్రజానీకంయొక్క ప్రధానమైన ఉమ్మడి కోర్కెలు ఏవంటే సోషలిస్టు శిబిరములోని అన్ని

కమ్యూనిస్టు వర్కర్సు పార్టీలు:— మార్క్సిస్టులెనినిస్టు పంథాకు కట్టువడిఉంటూ, దేశీయంగా, వైదేశికంగా ఖచ్చితమైన మార్క్సిస్టు-లెనినిస్టు విధానాలను అమలు జరపాలి;

—శ్రామికవర్గ నాయకత్వాన శ్రామికవర్గ నియంతృత్వాన్ని. కార్మిక-కర్షక మైత్రిని పటిష్ఠం చేయాలి. సోషలిస్టు విప్లవాన్ని ఆర్థిక, రాజకీయ, సిద్ధాంతరంగాలలో చివరికంటా కొనసాగించాలి.

—ప్రజాబాహుళ్యంయొక్క చొరవను,సృజనాత్మక శక్తిని ప్రోత్సహించాలి. ప్రణాళికా బద్ధమైన పద్ధతిలో సోషలిస్టునిర్మాణాన్ని అమలు జరపాలి. ఉత్పత్తిని అభివృద్ధిచేయాలి. ప్రజల జీవనాన్ని మెరుగుపరచాలి. దేశరక్షణను పటిష్ఠం చేయాలి.

—మార్క్సిజం-లెనినిజం ప్రాతిపదికపై సోషలిస్టు శిబిరం యొక్క ఐక్యతను పటిష్ఠంచేయాలి. శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రం ప్రాతిపదికపై ఇతర సోషలిస్టు దేశాలను బలపరచాలి;

—సామ్రాజ్యవాదుల దురాక్రమణ, యుద్ధ విధానాలను వ్యతిరేకించాలి, ప్రపంచ శాంతిని బలపరచాలి;

—అన్ని దేశాలలో అభివృద్ధి నిరోధకులు అమలు జరిపే కమ్యూనిస్టు వ్యతిరేక, ప్రజావ్యతిరేక, విప్లవప్రతీఘాతక విధానాలను వ్యతిరేకించాలి.

—ప్రపంచంలోని పీడితవర్గాల, పీడితజాతుల విప్లవ పోరాటాలకు తోడ్పడాలి.

ఈకోర్కెల సాధనకు సోషలిస్టు శిబిరంలోని అన్ని కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీలు, తమదేశ ప్రజలకు, అంతర్జాతీయ శ్రామికవర్గానికి, కార్మిక ప్రజానీకానికి రుణపడి ఉన్నాయి.

ఈకోర్కెలను నెరవేర్చడంద్వారా సోషలిస్టుశిబిరం మానవచరిత్ర గమనంపై ఒకనిశ్చయాత్మకమైన ముద్రవేయగలదు.

ఈకారణంచేతనే, సామ్రాజ్యవాదులు, అభివృద్ధి నిరోధకులు సోషలిస్టుశిబిరంలోనిదేశాల దేశీయ, విదేశాంగవిధానాలను అడ్డుకొట్టి, సోషలిస్టుశిబిరాన్ని బలహీనపరచడానికి, సోషలిస్టుదేశాలఐక్యతను, ముఖ్యంగా చైనా, సోవియట్ యూనియన్ల ఐక్యతను భగ్నంచేయడానికి సహస్రవిధాల ప్రయత్నిస్తూనేఉన్నారు. సోషలిస్టుదేశాలను చీల్చడానికి, విచ్ఛిన్నపరచడానికి నిర్విరామంగాకృషిచేస్తున్నారు. తుదకు సోషలిస్టుశిబిరాన్ని రూపుమాపాలనే గొంతెమ్మ కోర్కెను కూడా వెలిబుచ్చుతున్నారు.

సోషలిస్టుశిబిరంపట్ల సరిఅయినవైఖరిఏమిటనే సమస్య అన్ని కమ్యూనిస్టు, వర్కర్సుపార్టీలను ఎదుర్కొంటున్న అతి ప్రధానమైన సిద్ధాంతసమస్య.

ప్రస్తుతంకమ్యూనిస్టు, వర్కర్సుపార్టీలు నూతన చారిత్రికపరిస్థితులలో శ్రామికవర్గ అంతర్జాతీయఐక్యత, పోరాట కర్తవ్యాన్ని కొనసాగిస్తున్నాయి. ఒకేఒక సోషలిస్టుదేశంఉన్నప్పుడు, ఈదేశం దృఢంగానిలబడి సరిఅయిన మార్క్సిస్టు-

లెనినిస్టుపంథాను, విధానాలను అనుసరిస్తున్నందువల్ల శత్రుత్వాన్ని, సామ్రాజ్యవాదులు, అభివృద్ధినిరోధకులందరిద్వారా ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నప్పుడు, ఒకేఒక సోషలిస్టు దేశాన్ని తు.చ. తప్పకుండా బలపరచడమా లేదా అనేది శ్రామిక అంతర్జాతీయతాసూత్రాన్నిపాటించే ప్రతికమ్యూనిస్టుపార్టీకి గీటురాయిగాఉండేది. ఇప్పుడుపదమూడు దేశాలతో కూడిన సోషలిస్టుశిబిరం ఏర్పడింది. ఆదేశాలు ఏవంటే ఆల్బేనియా, బల్గేరియా, చైనా, క్యూబా, జెకోస్లావేకియా, జర్మనీ ప్రజాస్వామికరిపబ్లిక్, హంగరీ, కొరియాప్రజాస్వామిక రిపబ్లిక్, మంగోలియా, పోలెండ్, రుమేనియా, సోవియట్ యూనియన్, వియత్నాం ప్రజాస్వామికరిపబ్లిక్. ఈపరిస్థితులలో, శ్రామికవర్గ అంతర్జాతీయతాసూత్రాన్ని పాటించే ప్రతికమ్యూనిస్టుపార్టీకి గీటురాయిఏదంటే, అది యావత్తుసోషలిస్టు శిబిరాన్ని బలపరుస్తున్నదాలేదా అనేదే. మార్క్సిజం-లెనినిజం ప్రాతిపదికపై, ఆశిబిరంలోని అన్నిదేశాలఐక్యతను కాపాడడానికి నిర్విరామకృషి చేస్తున్నదాలేదా అనేదే. సోషలిస్టు దేశాలు అనుసరించదగిన మార్క్సిస్టు-లెనినిస్టుపంథాను, విధానాలను బలపరుస్తున్నదాలేదా అనేదే.

ఎవరైనా సరిఅయిన మార్క్సిస్టు - లెనినిస్టు పంథాను విధానాలను అనుసరించకుండా ఉన్నట్లయితే, సోషలిస్టు శిబిరం యొక్క ఐక్యతను కాపాడకుండా, పైపెచ్చు దానిలో ఉద్రిక్తతను చీలికలను సృష్టిస్తున్నట్లయితే, లేదా యుగోస్లావ్ రివిజనిస్టుల విధానాలను సైతం అనుసరిస్తున్నట్లయితే, సోషలిస్టు శిబిరాన్ని నాశనం చేయడానికి ప్రయత్నిస్తున్నట్లయితే, లేదా

సోదర సోషలిస్టు దేశాలను ఎదిరించే నిమిత్తం పెట్టుబడి దారీ దేశాలకు తోడ్పడుతున్నట్లయితే, అతడు యావత్తు అంతర్జాతీయ శ్రామికవర్గంయొక్క, ప్రపంచ ప్రజలయొక్క ప్రయోజనాలకు ద్రోహం చేస్తున్నట్లే.

ఎవరైనా ఇతరుల అడుగుజాడలలో నడుస్తూ, సోషలిస్టు దేశాలు అనుసరించదగ్గ సరిఅయిన మార్క్సిస్టు-లెనినిస్టు పంథాను, విధానాలను బలపరిచే బదులు, ఏదో ఒక సోషలిస్టు దేశం అనుసరించే తప్పుడు అవకాశవాద పంథాను, విధానాలను బలపరుస్తున్నట్లయితే, ఐక్యతా విధానాన్ని బలపరిచే బదులు చీలిక తెచ్చిపెట్టే విధానాన్ని బలపరుస్తున్నట్లయితే అతడు మార్క్సిజం-లెనినిజానికి శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రానికి దూరమై పోతున్నట్లే.

(7) ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం ఏర్పడిన పరిస్థితిని అవకాశంగా తీసుకొని, అమెరికా సామ్రాజ్యవాదులు జర్మన్ ఇటాలియన్, జపాన్ ఫాసిస్టుల అడుగుజాడలలో నడిచారు. కని విని ఎరుగనివిధంగా సువిశాలమైన ప్రపంచ సామ్రాజ్యాన్ని స్థాపించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. వ్యూహం రీత్యా అమెరికా సామ్రాజ్యవాదంయొక్క లక్ష్యాలు ఏవంటే అమెరికాకు సోషలిస్టు శిబిరానికి మధ్యస్థమండలాన్ని లాక్కొని, దానిపై పెత్తనం చెలాయించడం, పీడితప్రజలు, దేశాలు సాగించే విప్లవాలను అణచిపారవేయడం, సోషలిస్టుదేశాలను నాశనం చేయడానికి ఉపక్రమించడం, ఈవిధంగా ప్రపంచములోని అన్నిజాతులను, తనమిత్రదేశాలతో సహా ప్రపంచ

ములోని అన్ని దేశాలను అమెరికా గుత్తపెట్టుబడిదారీ పెత్త నానికి, శాసిసత్వానికి గురిచేయడం.

ద్వితీయ ప్రపంచయుద్ధకాలంనుండే అమెరికాసామ్రాజ్య వాదులు సోవియట్ యూనియన్‌కు, సోషలిస్టుశిబిరానికి వ్యతి రేకంగాయుద్ధప్రిచారం చేస్తున్నారు. ఈప్రచారం రెండు విధా లుగాఉంది. అమెరికాసామ్రాజ్యవాదులు వాస్తవంలోఇలాంటి యుద్ధానికి సన్నాహాలుచేస్తూనే, అమెరికాప్రజలను పీడించ డానికి, తక్కిన పెట్టుబడిదారీ ప్రిపంచానికి వ్యతిరేకంగా తమ దురాక్రమణను విస్తృతపరచుకోవడానికి ఈప్రిచారాన్ని ఒక సాధనంగాకూడ ఉపయోగిస్తున్నారు.

1960 ప్రికటన ఈదిగువ విధంగా పేర్కొంటున్నది :

"అమెరికాసామ్రాజ్యవాదం అంతర్జాతీయంగాఅన్నిటి కంటె పెద్దదోపిడీదారుగా తయారైంది"

"నేడు వలసపెత్తందారీవిధానానికి అమెరికా మూల విరాట్టుగాఉంది."

"దురాక్రమణకు, యుద్ధానికి అమెరికా సామ్రాజ్య వాదం ప్రిధానశక్తిగా ఉంది."

"ప్రపంచఅభివృద్ధి నిరోధకత్వానికి ప్రిధానమైన ఊత మని, అంతర్జాతీయ పోలీసుదళమని, మొత్తం ప్రిపంచజాతుల శత్రువుగా తయారైందనే వాస్తవాన్ని ఇటీవల కాలంలో జరి గిన అంతర్జాతీయపరిణామాలు కొత్తగా అనేకరుజువులద్వారా తెలియజేశాయి."

అమెరికాసామ్రాజ్యవాదం తనదురాక్రిమణ, యుద్ధ విధానాలను ప్రపంచమంతటా రుద్దుతున్నది. అయితే ఉద్దే

శించినదానికి వ్యతిరేకమైన ఫలితమేలభిస్తుంది. పర్యవసానం ఏమవుతుందంటే, ఇదిఅన్నిదేశాలలోని ప్రజలజాగృతిని, వారి విప్లవాలను త్వరితం చేస్తుంది.

అమెరికాసామ్రాజ్యవాదులు ఇలా ప్రపంచప్రజలందరికిచుక్కెదురు అయినారు. వారిచేతచుట్టివేయబడినారు. అంతర్జాతీయశ్రామికవర్గంతాను ఐక్యపరచగలశక్తులన్నిటిని ఐక్యపరచాలి. ఐక్యపరచగలదు. శత్రుశిబిరంలో అంతర్వైరుధ్యాలను ఉపయోగించుకోవాలి. అమెరికాసామ్రాజ్యవాదులకు, వారి తాబేదార్లకు వ్యతిరేకంగా విశాలమైన ఐక్యసంఘటనను నిర్మించాలి.

ప్రజలయొక్క- మానవజాతియొక్క- మనుగడను ప్రపంచశ్రామికవర్గఐక్యతకు, పోరాటానికి, అన్నిదేశాల ప్రజలఐక్యతకు, పోరాటానికివదలిపెట్టడమే వాస్తవికమైన, సరిఅయిన పద్ధతి

అలాకాకుండా, శత్రువులకు, స్నేహితులకుమనకుమధ్య తేడాచూడకపోవడం, ప్రజలయొక్క, మానవజాతియొక్క మనుగడను అమెరికాసామ్రాజ్యవాదంతో మిలాఖత్‌కు అప్పగించడమంటే ప్రజలను పెడదారిపట్టించడమే అవుతుంది.

(8) సమకాలికప్రపంచంలో వేర్వేరువిధాలైన వైరుధ్యాలు సువిశాలమైన ఆశియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రాంతాలలో కేంద్రీకరింపబడి ఉన్నాయి; ఇవి సామ్రాజ్యవాద పరిపాలనకింద ఉన్న అరక్షిత ప్రాంతాలు. సామ్రాజ్య

వాదాన్ని ప్రత్యక్షంగా దెబ్బతీస్తున్న ప్రపంచ విప్లవ తుఫాను కేంద్రాలు.

ఈప్రాంతాలలో జాతీయ ప్రజాస్వామిక విప్లవోద్యమం, అంతర్జాతీయ సోషలిస్టు విప్లవోద్యమం మన యుగంలో చరిత్రాత్మకమైన రెండు మహాప్రవాహాలు.

ఈప్రాంతాలలో జాతీయ ప్రజాస్వామిక విప్లవం సమకాలిక శ్రామికవర్గ ప్రపంచవిప్లవంలో ప్రధానమైన భాగంగా ఉంది.

ఆసియా,ఆఫ్రికా,లాటిన్ అమెరికా ప్రజలసామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవపోరాటాలు పాత, కొత్త సామ్రాజ్యవాద వలస పెత్తందారీ పరిపాలనయొక్క పునాదులను పెకలించి వేస్తున్నాయి. ఈపోరాటాలు ప్రస్తుతం ప్రపంచశాంతి రక్షణలో ఒక బలమైన శక్తిగా ఉన్నాయి.

కాబట్టి, ఒకవిధంగా అంతర్జాతీయ శ్రామికవర్గ విప్లవ లక్ష్యం యావత్తూ ఈప్రాంతాలలోని ప్రజల విప్లవ పోరాటాల ఫలితంపై ఆధారపడి ఉంది. ప్రపంచజనాభాలో అధిక సంఖ్యాకులు నివసించే ప్రాంతాలు ఇవి.

కాబట్టి, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవపోరాటం కేవలం ప్రాదేశిక ప్రాధాన్యతగల విషయం కానేకాదు. పైపెచ్చు శ్రామికవర్గ ప్రపంచ విప్లవ లక్ష్యాని కంతటికీ సర్వవిధాల ప్రాధాన్యతగల విషయం.

ప్రస్తుతం కొందరువ్యక్తులు ఎంతవరకు వెళ్ళుతున్నా రంటే, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజలసామ్రాజ్య వాద వ్యతిరేక విప్లవ పోరాటాలు అంతర్జాతీయంగా చాలా ప్రాధాన్యత కలిగి ఉన్నాయనే విషయాన్ని వారు నిరాకరిస్తు న్నారు. జాతీయత అనే అడ్డుగోడలను, వర్ణవిచక్షణను, భౌగోళిక హద్దులను నిర్మూలించేనెపంతో, పీడక, పీడిత జాతుల మధ్య, పీడక, పీడిత దేశాలమధ్య గీచిన ఎల్లలను తుడిచివేయడానికి, ఈప్రాంతాలలోని ప్రజల విప్లవ పోరాటా లపై చన్నీళ్ళు చల్లడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. వాస్తవంలో, వారు సామ్రాజ్యవాద ప్రయోజనాలకు తోడ్పడుతున్నారు.

ఈ ప్రాంతాలలో సామ్రాజ్యవాద పరిపాలన న్యాయ సంగతమేననిపించడానికి, దాని పాత, కొత్త వలసపెత్తందారీ విధానాలను ప్రోత్సహించడానికి ఒకకొత్త "సిద్ధాంతాన్ని" సృష్టిస్తున్నారు. నిజంగా, ఈ"సిద్ధాంతం" యొక్క ఉద్దేశం జాతీయత అనే అడ్డుగోడలను, వర్ణ విచక్షణను, భౌగోళిక హద్దులను రూపుమాపడంకాదు. "ఉన్నతజాతుల" పరిపాలన పీడితజాతులపై కొనసాగేట్లు చేయడమే దీనిఉద్దేశం. ఈప్రాం తాలలోని ప్రజలు ఈతప్పు "సిద్ధాంతాన్ని"తోసిపుచ్చడం సహజంగానే జరిగింది.

ప్రతి సోషలిస్టు దేశం, ప్రతిపెట్టుబడిదారీ దేశంలోని కార్మికవర్గం చిత్తశుద్ధితో "అన్నిదేశాల కార్మికులారా ఏకంకండి" "ప్రపంచ కార్మికులారా, పీడితజాతులారా, ఏకం

కంఠి" అనేపోరాటనినాదాలను అమలులో పెట్టాలి; ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజల విప్లవానుభవాన్ని అధ్యయనంచేయాలి. వారివిప్లవ పోరాటాలను బలపరచాలి. వారి విముక్తి తనకు మిక్కిలి ఆలంబనమైన తోడ్పాటుగాను, ప్రత్యక్షంగా తన ప్రయోజనాలకు అనుగుణమైనదిగాను లెక్కించాలి. జాతీయత అనే అడ్డుగోడలను, వర్ణవిచక్షణను, భౌగోళిక హద్దులను రూపుమాపడానికి ఆచరణసాధ్యమైన ఏకైక మార్గం ఇదే. నిజమైన శ్రామికవర్గ ఏకైక అంతర్జాతీయతా సూత్రం ఇదే.

యూరపు, అమెరికా పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గం తాను పీడితజాతులతో ఐక్యమైతే తప్ప, ఆజాతులు విముక్తి పొందితే తప్ప, స్వయంగా విముక్తి పొందడం అసాధ్యం. లెనిన్ ఎంతో చక్కగా చెప్పాడు. "పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిపే పోరాటంలో యూరపు,అమెరికా కార్మికులు, పెట్టుబడిదారీ విధానం ద్వారా పీడింపబడే కోట్లాది 'వలస' బానిసలతో 'సన్నిహితంగా' సంపూర్ణంగా ఐక్యంకాకపోతే, అభివృద్ధి పొందిన దేశాలలో విప్లవోద్యమం నిజంగా ఒక కపట నాటకం అవుతుంది." ("కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ద్వితీయ సమావేశం")

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో కొందరు వ్యక్తులు ప్రస్తుతం పీడితప్రజల విముక్తిపోరాటాలపట్ల కిమ్మన్నాస్తివైఖరి లేదా నిర్లక్ష్యవైఖరి, లేదా వ్యతిరేకవైఖరిని అవలంబిస్తున్నారు. వాస్తవంలో వారుగుత్తపెట్టుబడిదారీ

ప్రయోజనాలను కాపాడుతూ, శ్రామికవర్గప్రయోజనాలకు ద్రోహం చేస్తున్నారు. సోషల్ డెమాక్రాట్లుగా దిగజారి పోతున్నారు.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని ప్రజల విప్లవపోరాటాలపట్ల తీసుకొన్న వైఖరే విప్లవాన్ని ఎవరు కోరుతున్నారో, ఎవరు కోరడంలేదో, నిజంగా ప్రపంచ శాంతిని ఎవరు బలపరుస్తున్నారో, దురాక్రమణ, యుద్ధ శక్తులను ఎవరు ప్రోత్సహిస్తున్నారో తెలుసు కోవడానికి ముఖ్యమైన గీటురాయిగా ఉంటుంది.

(9)ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని పీడిత దేశాలు, ప్రజలముందు సామ్రాజ్యవాదాన్ని, దానితాబేదార్లను ఎదిరించవలసిన అత్యవసర కర్తవ్యం ఉంది.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా। పాత, కొత్తవలస పెత్తందారీ విధానానికి వ్యతిరేకంగా, జాతీయ స్వాతంత్రం కోసం నూతనప్రజాస్వామ్యంకోసం పోరాటపతాకాన్నిఎత్తే పవిత్రకర్తవ్యాన్ని జాతీయప్రజాస్వామిక విప్లవోద్యమంలో అగ్రశ్రేణిలోనిలబడిసోషలిస్టుభవిష్యత్తుకోసంకృషిచేసే పవిత్ర కర్తవ్యాన్ని ఈప్రాంతాలలోని శ్రామికవర్గ పార్టీలకు చరిత్ర అప్పగించింది.

ఈప్రాంతాలలో, జనాభాలోచెప్పుకోదగినంత విస్తృతమైనవర్గాలు సామ్రాజ్యవాదంకింద బానిసలుగాపడిఉండ నిరాకరిస్తున్నాయి. అలాంటివారిలో కార్మికులు, రైతులు, మేధావులు, పెట్టీబూర్జువాలేకాకుండా, దేశభక్తులైన జాతీయ

బూర్జువాలు, తుదకు దేశభక్తులైన కొందరు రాజులు, యువ రాజులు, దొరలుకూడ ఉన్నారు.

శ్రామికవర్గానికి, దానిపార్టీకి ప్రజానీకంయొక్క శక్తి పైన నమ్మకం ఉండాలి అన్నిటికంటెముఖ్యంగా రైతులతో ఐక్యమై, దృఢమైన కార్మిక-కర్షక మైత్రిని స్థాపించాలి. శ్రామిక వర్గంలో అగ్రగాములైన సభ్యులు గ్రామీణప్రాంతాలలో పని చేయడం, రైతులుసంఘటితమయ్యేట్లు తోడ్పడటం, వారిలో వర్గచైతన్యాన్ని, జాతీయఆత్మగౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించడంప్రధాన కర్తవ్యంగా ఎంచుకోవాలి.

కార్మిక-కర్షక మైత్రిప్రాతిపదికపై శ్రామికవర్గము, దానిపార్టీ సామ్రాజ్యవాదానికి, దానితాబేదార్లకు వ్యతిరేకంగా ఐక్యంకాదగినవారందరినీ ఐక్యపరచి, విశాలమైన ఐక్య సంఘటననునిర్మించాలి. ఈఐక్యసంఘటనను పటిష్ఠవంతం, విస్తృతంచేయాలంటే శ్రామికవర్గపార్టీసిద్ధాంతరీత్యా, రాజకీయరీత్యా నిర్మాణరీత్యా తనస్వతంత్రప్రతిపత్తిని నిలబెట్టుకోవడం, విప్లవనాయకత్వంపై వత్తిడి తేవడం అవసరం.

శ్రామికవర్గపార్టీకి, విప్లవపూరితులైన ప్రజలకుసాయుధ పోరాటంతోసహా అన్నిపోరాట పద్ధతులు కరతలామలకమై ఉండాలి. సామ్రాజ్యవాదము, దానితాబేదార్లూ సాయుధ దమననీతికి ఎప్పుడుదిగినాసరే, విప్లవసాయుధశక్తితో విప్లవ ప్రతీఘాత సాయుధశక్తిని ఓడించాలి.

ఇటీవలనే రాజకీయ స్వాతంత్ర్యం పొందిన జాతీయ రాజ్యాలు తమస్వాతంత్ర్యాన్ని పటిష్ఠంచేసుకోవడం, సామ్రాజ్య

వాదశక్తులను, దేశీయ అభివృద్ధినిరోధకశక్తులను రూపుమాపడం, వ్యావసాయక, తదితరసాంఘికసంస్కరణలనుఅమలుపరచడం, తమజాతీయ ఆర్థికవ్యవస్థను, సంస్కృతిని పెంపొందించుకోవడంవంటి క్లిష్టమైనకర్తవ్యాలను నేటికీ ఎదుర్కొంటున్నాయి. తమప్రయోజనాలను కాపాడుకోవడానికై పాతవలసపెత్తందార్లుఅనుసరించే నయావలసపెత్తందారీ విధానాలకు వ్యతిరేకంగా, ముఖ్యంగా అమెరికాసామ్రాజ్యవాదంయొక్క నయావలస పెత్తందారీవిధానానికి వ్యతిరేకంగా ఈ దేశాలు పోరాడటం చాలాప్రధానమైన విషయం.

ఈదేశాలుకొన్నిటిలో, దేశభక్తియుతమైన జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాదానికి, వలసపెత్తందారీ విధానానికివ్యతిరేకంగాజరిగేపోరాటంలో ప్రజానీకానికి బాసటగా ఉంటూ, సాంఘికాభ్యుదయానికి సంబంధించిన కొన్నిశాసనాలను ప్రవేశపెడుతున్నది. దేశభక్తియుతమైన జాతీయ బూర్జువావర్గంయొక్క అభ్యుదయపాత్రను శ్రామికవర్గపార్టీ పూర్తిగాబలపరచడం, వారితో ఐక్యతనుపటిష్ఠంచేసుకోవడం అవసరం.

దేశంలోపల సామాజికవైరుధ్యాలు,అంతర్జాతీయంగా వర్గపోరాటం తీవ్రంఅయ్యేకొద్దీ, నూతనంగా స్వాతంత్ర్యం పొందిన కొన్నిదేశాలలో బూర్జువావర్గం, ముఖ్యంగా, బడా బూర్జువావర్గం సామ్రాజ్యవాదాన్ని అట్టిపెట్టేదిగా తయారవుతుంది. ప్రజావ్యతిరేక, కమ్యూనిస్టువ్యతిరేక, విప్లవప్రతీఘాత విధానాలను అనుసరించడానికి సిద్ధమవుతుంది. ఈ అభివృద్ధి

నిరోధకవిధానాలను ఎదిరించడానికి శ్రామికవర్గపార్టీ నిర్విరామ కృషి సలపవలసిఉంది.

మొత్తంమీద, ఈ దేశాలలో బూర్జువావర్గం ద్వంద్వ స్వభావంకలిగిఉంది. బూర్జువావర్గంతో కలిసి ఐక్యసంఘటనను నిర్మించినప్పుడు, శ్రామికవర్గపార్టీ విధానం--ఐక్యత— పోరాట విధానంగాఉండాలి. బూర్జువావర్గం అభ్యుదయకర, సామ్రాజ్య వాదవ్యతిరేక, భూస్వామ్యవ్యతిరేకపాత్ర నిర్వహించేంతవరకు వారితో ఐక్యమయ్యేవిధానాన్ని అవలంబించాలి. వారుసామ్రా జ్యవాదంతోను, భూస్వామ్యశక్తులతోనురాజీపడి, మిలాఖత్ అయిపోయేఅభివృద్ధినిరోధక ధోరణులను అవంబించినప్పుడు, వాటికివ్యతిరేకంగా పోరాడేవిధానాన్ని అనుసరించాలి.

జాతీయసమస్యపై శ్రామికవర్గపార్టీ ప్రపంచదృక్పథం అంతర్జాతీయతా సూత్రబద్ధమైనదేకాని జాతీయతత్వంతో కూడినదికాదు. విప్లవపోరాటంలో అదిఅభ్యుదయకరజాతీయ తత్వాన్నిబలపరుస్తుంది. అభివృద్ధినిరోధక జాతీయతత్వాన్ని వ్యతిరేకిస్తుంది. అదిఎల్లప్పుడూ తనకూ, బూర్జువాజాతీయ తత్వానికిమధ్య స్పష్టమైనభేదాన్ని చూపెట్టాలి. అదిబూర్జువా జాతీయతత్వానికి ఎప్పటికీ లొంగిపోకూడదు.

1960 ప్రతంలో ఇలాఉంది. "బూర్జువావర్గంలోని అభి వృద్ధినిరోధకులు తమస్వార్థపూరిత, సంకుచితవర్గప్రయోజనా లనే యావజ్జాతి ప్రయోజనాలుగా ఎలాచిత్రిస్తుందో కమ్యూ నిస్టులువెల్లడిచేస్తారు; ఆప్రయోజనంకోసమే వాగాడంబరంగా

బూర్జువా రాజకీయవేత్తలు సోషలిస్టునినాదాలనుకూడ ఎలా ఉపయోగించుకొంటారో కమ్యూనిస్టులు వెల్లడిచేస్తారు...".

విప్లవంలో శ్రామికవర్గం భూస్వాముల, బూర్జువాల తోకగాతయారైతే, జాతీయప్రజాస్వామిక విప్లవంలోనిజమైన, లేదా సంపూర్ణమైనవిజయం సంభవించదు. ఒకరకమైన విజయంసాధించినప్పటికీ, దానిని పటిష్ఠవంతం చేసుకోవడం అసంభవమవుతుంది.

పీడితదేశాల, పీడితప్రజల విప్లవపోరాటాల సమయంలో శ్రామికవర్గపార్టీ సామ్రాజ్యవాదానికి, దేశీయఅభివృద్ధినిరోధకులకుపూర్తివ్యతిరేకంగా, జాతీయస్వాతంత్ర్యంకోసం, నూతన ప్రజాస్వామ్యంకోసం తనస్వంత కార్యక్రమాన్ని ముందు పెట్టాలి. అదిప్రజలమధ్య స్వతంత్రంగానేకృషిచేయాలి. అభ్యుదయకరశక్తులను నిరంతరం విస్తృతపరచాలి. మధ్యమశక్తులను తనవైపుతిప్పుకోవాలి. అభివృద్ధినిరోధకశక్తులను వేరుపరచాలి; ఈవిధంగాచేస్తేనే అది జాతీయప్రజాస్వామిక విప్లవాన్ని చివరికంటాకొనసాగించి, విప్లవాన్ని సోషలిస్టుపంథాకు తిప్పగలదు.

(10) సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ దేశాలలో పెట్టుబడిదారీసమాజంయొక్క వైరుధ్యాలనుపూర్తిగా పరిష్కరించడానికి శ్రామికవర్గవిప్లవమూ, శ్రామికవర్గనియంతృత్వమూ అవసరమవుతాయి.

ఈ కర్తవ్యసాధనకుకృషిచేయడంలో, శ్రామికవర్గపార్టీ ప్రస్తుతపరిస్థితులలో, గుత్తపెట్టుబడిదారీవిధానాన్ని వ్యతిరేకించడానికి, ప్రజాస్వామికహక్కులను కాపాడటానికి, ఫాసిజం

ప్రమాదాన్ని ఎదిరించడానికి, జీవనపరిస్థితులను మెరుగుపరచడానికి, సామ్రాజ్యవాదుల ఆయుధవిస్తృతీకరణను, యుద్ధసన్నాహాలను వ్యతిరేకించడానికి, ప్రపంచశాంతిని పరిరక్షించడానికి, పీడితదేశాల విప్లవపోరాటాలను క్రియారూపంలో బలపరచడానికి కార్మికవర్గాన్ని, కార్మికప్రజలను చురుకుగా పోరాటాలలోకి తీసుకురావాలి.

అమెరికాసామ్రాజ్యవాదం తనచెప్పుచేతలకింద ఉంచుకొన్న, లేదా తన చెప్పుచేతలకింద ఉంచుకోజూస్తున్న పెట్టుబడిదారీ దేశాలలో, కార్మికవర్గము, పజలు తమదాడులను ముఖ్యంగా అమెరికాసామ్రాజ్యవాదంపైన కేంద్రీకరించాలి. అలాగే జాతీయప్రయోజనాలకు ద్రోహంచేస్తున్నవారికి గుత్తపెట్టుబడిదార్లకు, తదితర అభివృద్ధినిరోధకశక్తులకు వ్యతిరేకంగాకూడ దాడులను కేంద్రీకరించాలి.

పెట్టుబడిదారీదేశాలలో కార్మికవర్గము, కార్మికప్రజలు ఒకనూతనజాగృతిని పొందినట్లు ఇటీవల సంవత్సరాలలో పెద్దఎత్తున జరిగిన ప్రజాపోరాటాలు రుజువుచేస్తున్నాయి. గుత్తపెట్టుబడిదారీవిధానాన్ని, అభివృద్ధినిరోధకశక్తులను దెబ్బతీసేవారిపోరాటాలు తమ స్వదేశాలలో విప్లవఆశయానికి చక్కని అవకాశాలను ఏర్పాటుచేశాయి. అలాగే ఆసియా, ఆఫ్రికా, లాటిన్అమెరికాప్రజల విప్లవపోరాటాలకు, సోషలిస్టు శిబిరంలోనిదేశాలకుబలమైన తోడ్పాటుగా ఉన్నాయి

సామ్రాజ్యవాద, లేదా పెట్టుబడిదారీ దేశాలలోని శ్రామికవర్గపార్టీలు విప్లవపోరాటాలను నడపడంలోతమస్వంత సిద్ధాంత, రాజకీయ, నిర్మాణస్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకో

వాలి. ఇదే సందర్భంలో, అవిఐక్యపరచదగిన శక్తులన్నిటినీ ఐక్యపరచి, గుత్తపెట్టుబడిదారీవిధానానికి, సామ్రాజ్యవాదుల దురాక్రమణ, యుద్ధవిధానాలకు వ్యతిరేకంగా విశాలమైన ఐక్యసంఘటనను నిర్మించాలి.

పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టులు, తక్షణపోరాటాలను చురుకుగా నడుపుతూనే, వాటిని దీర్ఘకాలపోరాటంలోను, సార్వత్రిక ప్రయోజనాలతోను ముడిపెట్టాలి. ప్రజలకుమార్క్సిస్టు-లెనినిస్టు విప్లవపద్ధతిలో విద్యాబోధ చేయాలి. వారి రాజకీయచైతన్యాన్ని పెంపొందించడానికి నిర్విరామ కృషిజరపాలి. శ్రామికవర్గవిప్లవమనే చారిత్రిక కర్తవ్యాన్ని చేబట్టాలి. వారు అలాచేయడంలో విఫలమైతే, తక్షణఉద్యమమే సమస్తమూ అనిభావిస్తే, ఆయా సమస్యనుబట్టి తమ వైఖరిని నిర్ణయించుకొంటూపోతే, నిత్యసంఘటనలకుమాత్రమే తమకృషిని పరిమితం చేసుకొంటూపోతే, శ్రామికవర్గమౌలికప్రయోజనాలను పరిత్యజిస్తే, అది సోషల్ డెమాక్రసీ అవుతుంది.

సోషల్ డెమాక్రసీ బూర్జువాసిద్ధాంతధోరణి. సోషల్ డెమాక్రటిక్ పార్టీలు బూర్జువావర్గానికి రాజకీయ ఉపాంగాలని, కార్మికవర్గఉద్యమంలో దానిఏజెంట్లని, సాంఘికంగా దానిమూలస్తంభాలని లెనిన్ చాలాకాలంకిందటే చెప్పాడు. కమ్యూనిస్టులు శ్రామికవర్గవిప్లవం, శ్రామికవర్గనియంతృత్వం అనేప్రధానసమస్యపై తమకూ, సోషల్ డెమాక్రటిక్ పార్టీలకు ఉన్నభేదాన్ని ఎల్లప్పుడూ స్పష్టీకరించాలి. అంతర్జాతీయ కార్మికవర్గఉద్యమంలోను, కార్మికప్రజలమధ్య సోషల్ డెమా

క్రసీయొక్క సిద్ధాంతప్రాభావాన్ని రూపుమాపాలి. నిస్సందే హంగానే, కమ్యూనిస్టులు సోషల్ డెమాక్రాటిక్ పార్టీల పలుకు బడికిందగల ప్రజానీకాన్ని తమవైపు త్రిప్పుకోవాలి. సోషల్ డెమాక్రాటిక్ పార్టీలలో ఉంటూ, దేశీయంగా గుత్త పెట్టుబడి దారీవిధానాన్ని, విదేశసామ్రాజ్యవాద ప్రాబల్యాన్ని వ్యతి రేకించడానికి ముందుకువచ్చే వామపక్షశక్తులను, మధ్యమ శక్తులను తమవైపు త్రిప్పుకోవాలి. కార్మికవర్గంజరిపేనిత్యపోరా టంలో, ప్రపంచశాంతి పరిరక్షణకోసంజరిగే పోరాటంలో, విస్తృత సంయుక్త కార్యాచరణలో వారిని కలుపుకోవాలి.

శ్రామికవర్గాన్ని, కార్మిక ప్రజలను విప్లవంలోకి తీసుకు రావాలంటే, మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలకు అన్ని పోరాట పద్ధతులు కరతలామలకం అయిఉండాలి. పోరాటపరిస్థితులు మారినప్పుడల్లా, ఒక పద్ధతికి బదులు మరోపద్ధతిని వెన్వెంటనే ప్రవేశపెట్టగలిగి ఉండాలి. శ్రామికవర్గంయొక్క అగ్రగామికి శాంతియుతమైనవి సాయుధమైనవి, బహిరంగమైనవి రహస్యమై నవి, చట్టబద్ధమైనవి చట్ట వ్యతిరేకమైనవి, పార్లమెంటరీ పోరా టం, ప్రజా పోరాటం మొదలైన అన్ని పోరాట పద్ధతులు కర తలామలకం అయిఉంటేనే, అది అన్ని పరిస్థితులలోను అజే యంగా నిలబడగలదు. ఉపయోగించుకోవడానికి వీలు ఉన్న ప్పుడు, ఉపయోగించుకోవలసిన అవసరం వచ్చినప్పుడు పార్ల మెంటరీ తదితర చట్టబద్ధమైన పోరాట పద్ధతులను ఉపయో గించుకో నిరాకరించడం తప్పు. అయినప్పటికీ, ఒక మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ చట్టబద్ధమైన కార్యకలాపాల పైన, పార్లమెంటు లో లభించే అవకాశాలపైన నమ్మకం పెట్టుకు కూర్చుని,

బూర్జువా వర్గం అనుమతించే హద్దులలోపల పోరాటాన్ని పరిమితంచేస్తే, ఇది శ్రామికవర్గ విప్లవానికి శ్రామికవర్గనియంతృత్వానికి తప్పనిసరిగా తిలాంజలి సమర్పించడానికే దారి తీస్తుంది.

(11) పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తన చెందే సమస్యపై శ్రామికవర్గపార్టీ వర్గ పోరాట, విప్లవ వైఖరితో ప్రారంభించాలి. శ్రామికవర్గ విప్లవానికి శ్రామిక వర్గ నియంతృత్వానికి సంబంధించి మార్క్సిస్టు-లెనినిస్టు బోధలపై ఆధారపడాలి.

శాంతియుత పద్ధతులద్వారా సోషలిజానికి పరివర్తన చెందడం ఉత్తమమని కమ్యూనిస్టులు ఎల్లప్పుడూ భావిస్తారు. అయితే శాంతియుత పరివర్తనను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ఒక నూతన ప్రపంచ వ్యాప్త వ్యూహాత్మక సూత్రంగా చేయడం సాధ్యమేనా? అలా సాధ్యం కానేకాదు.

అన్ని విప్లవాలలోను రాజ్యాధికారం ప్రధానమైన సమస్య అని మార్క్సిజం-లెనినిజం సర్వదా ఉద్ఘోషిస్తున్నది. 1957 ప్రకటన, 1960 పత్రం రెండూ "పాలకవర్గాలు తమంతట తామే అధికారాన్ని ఎప్పటికీ వదలుకోరు అని లెనినిజం బోధిస్తున్నది. అనుభవం చాటి చెబుతున్నది" అని స్పష్టంగా పేర్కొన్నాయి. పాతప్రభుత్వాన్ని దించివేస్తే తప్ప సంక్షోభ కాలంలో సైతం అది ఎప్పటికీ దిగిపోదు. ఇది వర్గ పోరాటం యొక్క విశ్వజనీన సూత్రం.

నిర్దిష్టచారిత్రక పరిస్థితులలో, విప్లవం శాంతియుతంగా పరిణమించే అవకాశం ఉందని మార్క్స్, లెనిన్‌లు చెప్పారు.

అయితే, లెనిన్ పేర్కొన్నట్లు, శాంతియుత విప్లవపరిణామం ఒక అవకాశం, "విప్లవాల చరిత్రలో ఇది చాలా అరుదుగానే కనిపిస్తుంది."

వాస్తవంలో, పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి శాంతియుతంగా పరివర్తన చెందినట్లు చారిత్రక దృష్టాంతం ఏదీ లేదు.

పెట్టుబడిదారీ విధానం స్థానాన్ని సోషలిజం తప్పనిసరిగా ఆక్రమిస్తుందని మార్క్సు జోస్యం చెప్పినప్పుడు అలాంటి దృష్టాంతం ఏదీ లేదుగదా, అలాంటప్పుడు దృష్టాంతం ఏదీ లేకపోయినా పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి శాంతియుతంగా పరివర్తన చెందవచ్చునని మనం జోస్యం ఎందుకు చెప్పకూడదు? అని కొందరు వ్యక్తులు వాదిస్తారు.

ఈ సామ్యం హాస్యాస్పదమైనది. గతి తర్కిక, చారిత్రక భౌతిక వాదాన్ని ఉపయోగిస్తూ, మార్క్సు పెట్టుబడిదారీ విధానం యొక్క వైరుధ్యాలను పరిశీలించాడు. మానవ సమాజపరిణామంయొక్క భౌతికనియమాలను కనుగొన్నాడు. ఒక శాస్త్రీయమైన నిర్ణయానికి వచ్చాడు. కాగా, "శాంతియుత పరివర్తన"పై తమ ఆశలన్నీ పెట్టుకొన్న ప్రవక్తలు చారిత్రక భావవాదం నుండి బయలుదేరుతారు. పెట్టుబడిదారీ విధానం యొక్క అతి ప్రధాన వైరుధ్యాలను ఖాతరు చేయరు. వర్గ పోరాటాన్ని గూర్చి మార్క్సిస్టు - లెనినిస్టు బోధనలను త్రోసిపుచ్చుతారు. స్వీయ మానసికమైన, నిరాధారమైన నిర్ణయాలకు వస్తారు. మార్క్సిజాన్ని త్రోసిపుచ్చే వారు మార్క్సునుండి ఎలాంటి తోడ్పాటు పొందగలరు?

పెట్టుబడిదారీ దేశాలు తమప్రభుత్వ యంత్రాంగాన్ని తమ మిలటరీ యంత్రాంగాన్ని పటిష్ఠం చేసుకుంటున్నాయనే విషయం ప్రతి ఒక్కరికీ తెలుసు. తమ దేశాలలోని ప్రజలను అణచివేయడమే ఆ యంత్రాంగం యొక్క ప్రధానోద్దేశం.

సామ్రాజ్యవాదులు, అభివృద్ధి నిరోధకులు శాంతియుత పరివర్తనను అంగీకరిస్తారనే భరోసాపై శ్రామికవర్గపార్టీ విప్లవంకోసం తన ఆలోచనలను, తన విధానాలను, తన యావత్తు కృషిని ఎప్పటికీ ఆధారం చేసుకోకూడదు.

శ్రామికవర్గపార్టీ రెండు పరిస్థితులకు సిద్ధంకావాలి : శాంతియుత విప్లవ పరిణామం కోసం తయారవుతూనే శాంతేతర పరిణామం కోసం కూడ పూర్తిగా అది తయారుకావాలి. విప్లవ బలాన్ని కూడదీయడమనే కష్టసహిష్ణుమైన కృషిపై అది కేంద్రీకరించాలి. అలాచేస్తే విప్లవంకోసం పరిస్థితులు పరిపక్వమైనప్పుడు విజయ సాధనకుగాని, సామ్రాజ్యవాదులు అభివృద్ధి నిరోధకులు ఆకస్మికదాడులు, సాయుధదుండగాలు జరిపితే బలమైనదెబ్బ కొట్టడానికిగాని సిద్ధంగా ఉండగలరు.

శ్రామివర్గపార్టీ ఇలాంటి సన్నాహాలు చేయడంలో విఫలమైతే, శ్రామికవర్గంయొక్క విప్లవాభీష్టాన్ని మంటగలిపినట్లు అవుతుంది. సిద్ధాంతరీత్యా నిరాయుధమై రాజకీయంగా నిర్మాణరీత్యా రెండు విధాల పూర్తిఅసంసిద్ధమై నిస్పృహలో మునిగిపోతుంది. ఇక శ్రామికవర్గ విప్లవాశయాన్ని పాతిపెట్టడమే దాని పర్యవసానం.

(12) మానవచరిత్రయొక్క వేర్వేరు దశలలో సామాజిక విప్లవాలన్నీ చారిత్రకంగా అనివార్యమైనవి. మానవుని

అభీష్టంతో నిమిత్తం లేకుండా భౌతికనియమాలచే ఇవిపాలింప బడతాయి. పైపెచ్చు, ఒడుదుడుకులు త్యాగాలు లేకుండా విజయంపొందగలిగిన విప్లవంలేదనేది చరిత్ర రుజువుచేస్తున్నది.

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని ప్రాతిపదిక చేసుకోవడంతో, నిర్దిష్టమైన చారిత్రక పరిస్థితులను పరిశీలించడం; సరి అయిన వ్యూహాన్ని, ఎత్తుగడలను ప్రవేశపెట్టడం; అగోచరమైన అడ్డంకులను అధిగమించడం, అనవసరమైన త్యాగాలను మానుకోవడం, క్రమంగా తమ గమ్యాన్ని చేరుకోవడంలో ప్రజానీకానికి తోడ్పడటం శ్రామికవర్గ పార్టీ కర్తవ్యమైంది. త్యాగాలను మొత్తంగా మానుకోవడం సాధ్యమేనా? బానిస విప్లవాలు, అర్ధబానిస విప్లవాలు, బూర్జువా విప్లవాలు, లేదా జాతీయ విప్లవాల విషయంలో ఇలాజరగదు; శ్రామికవర్గ విప్లవాల విషయంలోకూడ ఇలా జరగదు. విప్లవానికి తోడ్పడే పంథా సరైందే అయినప్పటికీ, విప్లవదశలో అపజయాలు, త్యాగాలు అవసరం కాబోవనే హామీ ఇవ్వడం అసాధ్యం. సరైన పంథాను అనుసరించినంతవరకు. విప్లవమే ఆఖరున విజయం పొంది తీరుతుంది. త్యాగాలను మానుకోవడం అనే సాకుతో విప్లవాన్ని వదలిపెట్టడం అంటే, మీరు శాశ్వతంగా బానిసలుగా నేపడి ఉండండి, అంతులేని బాధను, త్యాగాన్ని సహించండి అని వాస్తవంలో ప్రజలను కోరడమన్నమాటే.

విప్లవపు పురిటినొప్పులు పాతసమాజపు నిరంతర బాధకంటె ఎంతో తక్కువ బాధాకరంగా ఉంటాయని మార్క్సిజం-లెనినిజం యొక్క ప్రాథమిక విజ్ఞానం బోధిస్తుంది. "ఎంతో శాంతియుతమైన సంఘటనలతో సహా, నేటి (పెట్టుబడిదారీ)

వ్యవస్థ కార్మికవర్గంచేత ఎల్లప్పుడూ, అనివార్యంగా లెక్కలేనన్ని త్యాగాలను చేయిస్తుంది" అని లెనిన్ చక్కగా చెప్పాడు. ("మరో మూక ఉమ్మడి హత్య" పుట 11 సంపుటి 5 "ది కంప్లీట్ వర్క్స్ ఆఫ్ లెనిన్")

అంతా సవ్యంగా సాగిపోయేట్లయితేనే, త్యాగాలు, అపజయం లేకుండా ముందుకు వెళ్ళుతామనే హామీ ఉంటేనే, విప్లవాన్ని నడిపించాలని భావించేవాడు నిజంగా విప్లవకారుడు కానే కాదు.

పరిస్థితులు ఎంత క్లిష్టంగా ఉన్నా, విప్లవం ఎంతటి త్యాగాలను, అపజయాలను ఎదుర్కోవలసి వచ్చినా, శ్రామిక వర్గ విప్లవకారులు ప్రజానీకాన్ని విప్లవ పద్ధతిలో చైతన్యవంతులుగా చేయాలి, విప్లవపతాకను ఉన్నతస్థాయిలో ఉంచాలే గాని వదలిపెట్టకూడదు.

శ్రామికవర్గపార్టీ భౌతిక పరిస్థితులు పరిపక్వం కాక ముందే దుడుకుగా విప్లవాన్ని లేవదీస్తే, అది "అతివాద" దుస్సాహసవిధానమే అవుతుంది. అయితే శ్రామికవర్గపార్టీ భౌతిక పరిస్థితులు పరిపక్వమై ఉన్నప్పుడు విప్లవాన్ని నడపడానికి, ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి సాహసింపకపోతే, అది మితవాద అవకాశవాదమే అవుతుంది.

మామూలు పరిస్థితులలో కూడ, ప్రజానీకాన్ని నిత్య పోరాటాలలోకి తీసుకువస్తున్నప్పుడు, శ్రామికవర్గపార్టీ సిద్ధాంతరీత్యా, రాజకీయంగా, నిర్మాణరీత్యా తన కార్యకర్తలను, ప్రజానీకాన్ని విప్లవానికి సిద్ధపరచాలి. విప్లవ పోరాటాలను ప్రోత్సహించాలి. అలా చేస్తే విప్లవానికి పరిస్థితులు పరిపక్వ

మైనప్పుడు అభివృద్ధి నిరోధక పరిపాలనను కూలదోసి నూతన ప్రభుత్వాధికారాన్ని స్థాపించడానికి గల అవకాశాన్ని అది జారవిడవకుండా ఉండగలదు. లేకపోతే, భౌతిక పరిస్థితులు పరిపక్వమై ఉన్నప్పుడు, శ్రామికవర్గపార్టీ విజయాన్ని చేబట్టే అవకాశాన్ని ఊరకనే జారవిడుస్తుంది.

శ్రామికవర్గపార్టీ ఎంతో సూత్రబద్ధంగా ఉంటూనే, ఇచ్చి పుచ్చుకోవడానికి అందుబాటులో కూడ ఉండాలి. సమయం వచ్చినప్పుడు విప్లవ ప్రయోజనాల దృష్ట్యా, అవసరమైన రాజీ ఒప్పందాలు కుదుర్చుకోవాలి. అయితే ఇచ్చి పుచ్చుకోనే సాకుతో, అవసరమైన రాజీ ఒప్పందాల సాకుతో, సూత్రబద్ధమైన విధానాలను, విప్లవ గమ్యాన్ని ఎప్పటికీ వదల కూడదు.

శత్రువులకు వ్యతిరేకంగా పోరాటాలు జరపడానికి శ్రామికవర్గపార్టీ ప్రజానీకానికి నాయకత్వం వహించాలి. ఆ శత్రువులమధ్య గల వైరుధ్యాలను ఎలా ఎలా ఉపయోగించుకోవాలో అది గ్రహించాలి. అయితే ఈ వైరుధ్యాలను ఉపయోగించుకోవడంలో ఉద్దేశం ప్రజా విప్లవ పోరాటాల గమ్యం చేరుకోవడాన్ని సులభతరం చేయడానికే గాని ఈ పోరాటాలను వమ్ముచేయడానికి కాదు.

సామ్రాజ్యవాదంయొక్క, అభివృద్ధి నిరోధకత్వం యొక్క చీకటి పరిపాలన ఉన్నచోటెల్లా, జనాభాలో నూటికి తొంభైమందికి పైగా ప్రజలు ఇప్పుడో, మరొకప్పుడో విప్లవం లేవదీస్తున్నట్లు లెక్కలేనన్ని వాస్తవాలు రుజువుచేశాయి.

కమ్యూనిస్టులు ప్రజానీకం యొక్క విప్లవయుతమైన కోర్కెలనుండి వేరుపడిపోతే, వారు ప్రజానీకంయొక్క విశ్వాసాన్ని తప్పనిసరిగా కోల్పోతారు. విప్లవ ప్రవాహానికి వెనకబడి పోతారు.

ఏ పార్టీలోనైనా నాయకత్వం వహించే గ్రూపు మార్క్సిస్టేతర పంథాను అనుసరించి, దానిని సంస్కరణవాద పార్టీగా మార్చివేస్తే, ఆ పార్టీలోపల, బయటఉన్న విప్లవకారులైన లెనినిస్టులు వారి స్థానాన్ని ఆక్రమించి, ప్రజలను విప్లవంలోకి తీసుకువస్తారు. మరొకదశలో, బూర్జువా విప్లవకారులు విప్లవాన్ని నడపడానికై ముందుకురావడం, శ్రామిక వర్గపార్టీ తన విప్లవ నాయకత్వాన్ని కోల్పోవడం జరుగుతుంది. అభివృద్ధి నిరోధకమైన బూర్జువావర్గం విప్లవానికి ద్రోహంచేసి, ప్రజలను అణచివేసినప్పుడు, ఒక అవకాశవాద పంథా కమ్యూనిస్టులకు, విప్లవ ప్రజానీకానికి విషాదకరమైన, అనవసరమైన నష్టాలు కలిగిస్తుంది.

కమ్యూనిస్టులు అవకాశవాద పంథాకు దిగజారితే,వారు బూర్జువా జాతీయవాదులుగా తయారవుతారు, సామ్రాజ్యవాదులకు, అభివృద్ధి నిరోధక బూర్జువాలకు తోకలు అయిపోతారు.

లెనిన్ తర్వాత తాము విప్లవ సిద్ధాంతానికి బ్రహ్మాండమైన సృజనాత్మకమైన తోడ్పాటు ఇచ్చామని, తాము ఒక్కరే సరిఅయిన వారమని చెప్పుకొనే వ్యక్తులు కొందరు ఉన్నారు. అయితే వారు యావత్తు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క విస్తృత అనుభవాలను నిజంగా ఎప్పుడైనా పరిశీలిం

చారా లేదా అనేది, వారు మొత్తం అంతర్జాతీయ శ్రామిక వర్గ ఉద్యమం యొక్క ప్రయోజనాలను, గమ్యాన్ని, కర్తవ్యాలను నిజంగా ఎప్పుడైనా పరిశీలించారా లేదా అనేది, మార్క్సిజం-లెనినిజానికి అనుగుణంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ఒక సాధారణ పంథా వారి దృష్టిలో ఉందా లేదా అనేది చాలా సందేహాస్పదం.

గత కొద్ది సంవత్సరాలలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమమూ, జాతీయ విముక్తి ఉద్యమమూ అనేక అనుభవాలను, అనేక గుణపాఠాలను పొందాయి. ప్రజలు ప్రశంసించ వలసిన అనుభవాలు, ప్రజలకు దుఃఖము కలిగించే అనుభవాలు ఉన్నాయి. అన్ని దేశాలలోని కమ్యూనిస్టులూ, విప్లవకారులూ ఈ విజయానుభవాలను, అపజయానుభవాలను పరిశీలించాలి, వీటిని తీవ్రంగా అధ్యయనం చేయాలి. వీటినుండి సరిఅయిన నిర్ణయాలు తీసుకోవాలి; ఉపయోగకరమైన గుణపాఠాలను నేర్చుకోవాలి.

(13) సోషలిస్టుదేశాలూ, పీడితజాతుల, పీడితదేశాల విప్లవపోరాటాలూ ఒకదాని నొకటి బలపరచుకొంటాయి, ఒకదాని కొకటి తోడ్పడతాయి.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాల జాతీయవిముక్తి ఉద్యమాలు, పెట్టుబడిదారీ దేశాల విప్లవోద్యమాలు సోషలిస్టు దేశాలకు బలమైన తోడ్పాటుగాఉన్నాయి. దీనిని త్రోసిపుచ్చడం శుద్ధతప్పు.

పీడితజాతుల, పీడితదేశాల, విప్లవ పోరాటాలపట్ల సోషలిస్టుదేశాలు అవలంబించవలసిన ఏకైక వైఖరి ఏమిటంటే

అవి హృదయపూర్వకమైన సానుభూతిని, సక్రియ సహకారాన్ని అందజేయాలి; నిర్లక్ష్యవైఖరినిగాని, జాతీయస్వార్థంతో కూడిన, లేదా పెద్దరాజ్యమనే జాతీయ దురహంకార వైఖరిని గాని అవలంబించ కూడదు.

లెనిన్ ఇలాచెప్పాడు: "సామ్రాజ్యవాదులలో ఏఒక్కరికి వ్యతిరేకంగానైనా సరే, సామ్రాజ్యవాదు లందరికి వ్యతిరేకంగా నైనాసరే, అభివృద్ధి పొందిన దేశాలలోని విప్లవకారులతో, పీడిత ప్రజలందరితో మైత్రినెరపడం శ్రామికవర్గ విదేశాంగ విధానంగా ఉంటుంది" ("రష్యన్ విప్లవ విదేశాంగ విధానం" పుట 72 సంపుటి 15 "లెనిన్ సంపూర్ణ రచనలు") ఈ విషయాన్ని ఎవరైనా అవగాహన చేసుకోకపోతే, పీడిత ప్రజలకు పీడితదేశాలకు సోషలిస్టుదేశాలు అందజేసేతోడ్పాటు సహాయం ఒక భారమనిగాని, ఔదార్యమనిగాని భావిస్తే, మార్క్సిజం – లెనినిజానికి, శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రానికి వ్యతిరేకంగా వెళ్లినట్లే అవుతుంది.

నిర్మాణంలో సోషలిస్టు వ్యవస్థయొక్క విశిష్టత, సోషలిస్టు దేశాల విజయాలు ఆదర్శమైన పాత్ర వహిస్తున్నాయి. పీడితజాతులకు, పీడితదేశాలకు ప్రోత్సాహకరంగా ఉన్నాయి.

అయితే ఈ ఆదర్శమైనపాత్ర, ప్రోత్సాహమూ పీడిత ప్రజల, పీడితదేశాల విప్లవ పోరాటాలస్థానాన్ని ఎప్పటికీ ఆక్రమించజాలదు. ఏ పీడితప్రజలుగాని, పీడిత దేశం గాని ఆత్మవిశ్వాసంతో జరిపిన తనస్వంత విప్లవపోరాటం ద్వారానేతప్ప ఇతరత్రా విముక్తి సాధించుకో జాలదు.

సోషలిస్టు దేశాలకు, సామ్రాజ్యవాద దేశాలకు మధ్య శాంతియుత పోటీవహించే పాత్రను కొందరు వ్యక్తులు ఏకపక్షంగా గోరంతలు కొండంతలు చేసి చెప్పారు. పీడితప్రజల పీడితదేశాల విప్లవ పోరాటాల స్థానంలో శాంతియుతపోటీని నిలబెట్టేందుకు ప్రయత్నించారు. వారిప్రచారాన్నిబట్టి శాంతి యుత పోటీకాలంలో సామ్రాజ్యవాదం తనంతటతానే నాశనమై పోతుందని, ఇలాంటిరోజుకోసం ప్రశాంతంగా ఎదురు చూడటం మాత్రమే పీడితప్రజల, పీడితదేశాలు చేయవలసిన పని అన్నట్లు కనిపిస్తుంది. మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథాలకు, దీనికి ఏమైనా పొత్తుకుదురు తుందా?

పైపెచ్చు, చైనా, తదితరకొన్ని సోషలిస్టు దేశాలు "యుద్ధాలనులేవదీయాలని" "రాజ్యా మధ్యయుద్ధాల"ద్వారా సోషలిజాన్ని వ్యాపింప జేయాలని ఉద్దేశిస్తున్నట్లు కొందరు వ్యక్తులు వింత గాథను సృష్టించారు. ఇలాంటిగాథలు సామ్రాజ్యవాదులు అభివృద్ధినిరోధకులు వేసేనిందలుతప్ప మరొకటికావని 1960 పత్రం పేర్కొన్నది. నిర్మొగమాటంగా చెప్పాలంటే ఈ నిందలను పునశ్చరణ చేసేవారి ఉద్దేశం ప్రపంచ పీడితప్రజల పీడితదేశాల విప్లవాలకు, అలాంటి విప్లవాలను బలపరిచేవారికి తాము వ్యతిరేకులనే వాస్తవాన్ని కప్పిపుచ్చుకోవడమే.

(14) గత కొలది సంవత్సరాలలో, యుద్ధమూ, శాంతి సమస్యపై ఎంతో రభస, వాస్తవంలో పెద్దరభసే జరిగింది. ఈ సమస్యపై మా దృక్పథాలు, విధానాలు ప్రపంచానికి తెలుసు. వాటిని ఎవ్వరూ వక్రంగా చిత్రించజాలరు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో కొందరువ్యక్తులు తాము శాంతిని ఎంతగా ప్రేమిస్తున్నారో, యుద్ధాన్ని ఎంతగా ద్వేషిస్తున్నారో చెప్పుకొంటున్నప్పటికీ, యుద్ధాన్ని గూర్చి లెనిన్ పేర్కొన్న సాధారణవాస్తవాన్ని కొద్దిగానైనా అవగాహన చేసుకోవడానికి ఇష్టపడక పోవడం దురదృష్టం.

లెనిన్ ఇలాచెప్పాడు: "యుద్ధసమస్యను గూర్చి మామూలుగా విస్మరించబడుతున్న, తగినంత శ్రద్ధ కనబరచ బడకపోతున్న ప్రధాన విషయం, ఇదిఎంతో వివాదాస్పదంగా, ఇంకా చెప్పాలంటే, నిష్ప్రయోజనమైన, నిరర్థకమైన, ఉద్దేశ రహితమైన వివాదంగా తయారు కావడానికి ప్రధానకారణం ఏమిటంటే, యుద్ధంయొక్క వర్గస్వభావానికి సంబంధించిన ప్రధాన సమస్యను, అంటే యుద్ధం ఎందుకువచ్చింది, దానిలో పాల్గొంటున్న వర్గాలేవి, అందుకు దారితీసిన చారిత్రక, చారిత్రక-ఆర్థిక పరిస్థితులేవి అనేసమస్యను ప్రజలు విస్మరిస్తున్నట్లు కనిపిస్తుంది" ("యుద్ధమూ, విప్లవమూ" పుట 367 సంపుటి 24 "లెనిన్ సంపూర్ణ రచనలు")

మార్క్సిస్టు-లెనినిస్టుల దృక్పథం ప్రకారం, ఇతర పద్ధతులద్వారా రాజకీయాలను కొనసాగించడమే యుద్ధం. ప్రతి యుద్ధమూ రాజకీయ వ్యవస్థనుండి, అందుకు దారితీసే రాజకీయ పోరాటాలనుండి విడదీయరానిది. వర్గపోరాట చరిత్ర యావత్తూ ధ్రువపరచిన ఈ శాస్త్రీయ మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాన్ని వదలి పెట్టేట్లయితే, యుద్ధ సమస్యనుగాని, శాంతి సమస్యనుగాని ఎవ్వరూ ఎప్పటికీ అవగాహన చేసుకోలేరు.

వేర్వేరువిధాలుగా శాంతి, వేర్వేరువిధాలుగాయుద్ధమూ ఉంటాయి. ఏవిధమైన శాంతి, లేదా ఏవిధమైన యుద్ధం చర్చనీయాంశంగా ఉందో మార్క్సిస్టు లెనినిష్టులకు స్పష్టమైన అవగాహన ఉండాలి. న్యాయమైన యుద్ధాలను, అన్యాయమైనయుద్ధాలను ఒకే గాటికికట్టి, విచక్షణ లేకుండా వాటినన్నిటిని వ్యతిరేకించడమనేది బూర్జువా ఉపశమనవాదుల దృక్పథమేగాని మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం కాదు.

యుద్ధాలు లేకుండా విప్లవాలు పూర్తిగా సాధ్యమేనని కొందరు వ్యక్తులు వాదిస్తున్నారు. ప్రస్తుతం వారు ఏవిధమైన యుద్ధాన్ని ప్రస్తావిస్తున్నారు – జాతీయ విముక్తి యుద్ధమా, లేక విప్లవ అంతర్యుద్ధమా? లేక ప్రపంచయుద్ధమా?

వారు జాతీయ విముక్తి యుద్ధాన్నిగాని, విప్లవ అంతర్యుద్ధాన్ని గాని ప్రస్తావిస్తు నట్లయితే ఈ సూత్రీకరణ ఆచరణలో విప్లవయుద్ధాలకు, విప్లవానికి వ్యతిరేకమైనది.

వారు ప్రపంచయుద్ధాన్ని ప్రస్తావిస్తున్నట్లయితే, లేని లక్ష్యంపై పుగురిపెట్టి కాల్చుతున్నారన్నమాట. రెండుప్రపంచ యుద్ధాలచరిత్ర ఆధారంగా, ప్రపంచయుద్ధాలు అనివార్యంగా విప్లవానికి దారితీస్తాయని మార్క్సిస్టు లెనినిస్టులు పేర్కొన్నప్పటికీ, ప్రపంచయుద్ధం ద్వారానే విప్లవాన్ని లేవదీయాలని ఏ మార్క్సిస్టు-లెనినిస్టూ ఎన్నడూ వాదించలేదు, ఎన్నటికీ వాదించబోడు.

యుద్ధాన్ని రద్దుచేయడం మార్క్సిస్టు-లెనినిస్టులు తమ ఆదర్శంగా భావిస్తారు, యుద్ధాన్ని రద్దుచేయ వచ్చునని నమ్ముతారు.

అయితే యుద్ధాన్ని ఎలా రద్దుచేయవచ్చు? దీనిపై లెనిన్ వెలిబుచ్చిన అభిప్రాయం ఇది, "...సోషలిస్టు సామాజిక వ్యవస్థను సాధించడం మన ఆశయం. వర్గాలుగా మానవ జాతి విభజనను రద్దుపరచడం ద్వారా, మానవుని మానవుడు జాతిని మరోజాతి దోచుకోవడం పూర్తిగా రద్దుచేయడంద్వారా అది యుద్ధం వచ్చే అవకాశమే లేకుండా చేయగలదు" ("యుద్ధమూ, విప్లవమూ", పుటలు 267-368, సంపుటి 24, "లెనిన్ సంపూర్ణ రచనలు")

1960 ప్రకటనలో కూడ "ప్రపంచమంతటా సోషలిస్టు విజయం అన్ని యుద్ధాలకు గల సామాజిక, జాతీయ కారణాలను పూర్తిగా తొలగించగలద"ని చాలా స్పష్టంగా పేర్కొన బడింది.

అయినప్పటికీ, సామ్రాజ్యవాద వ్యవస్థ ఉండగా మానవునిచే మానవుని దోపిడీ నేటికీ కొనసాగుతూ ఉండగా, "సమగ్ర, సంపూర్ణ నిరాయుధీకరణ" ద్వారా "ఆయుధాలు లేని, సాయుధ బలగాలులేని, యుద్ధాలులేని" ప్రపంచాన్ని సృష్టించడం సాధ్యమేనని కొందరు వ్యక్తులు నేడు వాస్తవంగానే వాదిస్తున్నారు. ఇది వట్టి భ్రమ.

సాయుధ బలగాలు ప్రభుత్వ యంత్రాంగంలో ప్రధానమైన భాగమని, ఆయుధాలులేని, సాయుధబలగాలులేని ప్రపంచం ప్రభుత్వాలులేని ప్రపంచం మాత్రమే కాగలదని మార్క్సిజం-లెనినిజం యొక్క ప్రాథమిక జ్ఞానంవల్ల మనకు బోధపడుతుంది. లెనిన్ ఇలా అన్నాడు: "శ్రామికవర్గం బూర్జువా వర్గాన్ని నిరాయుధం చేసిన తర్వాతనే, తన ప్రపంచ చరిత్రా

త్మక ఆశయాన్ని మంటగలపకుండా, అన్ని ఆయుధాలను చెత్తకుప్పలో పోయగలదు; శ్రామికవర్గం నిస్సందేహంగానే ఈ పని చేయగలదు, అయితే ఈ పరిస్థితి ఏర్పడినప్పుడు మాత్రమే, నిజంగా అంతకుముందే కాదు." ("శ్రామికవర్గ విప్లవంయొక్క యుద్ధ కార్యక్రమం" పుట 77, సంపుటి 23 "లెనిన్ సంపూర్ణ రచనలు")

నేడు ప్రపంచంలోని వాస్తవాలేమిటి? అమెరికా నాయకత్వాన సామ్రాజ్యవాద దేశాలు సమగ్ర, సంపూర్ణ నిరాయుధీకరణను అమలు జరపడానికి సిద్ధంగా ఉన్నట్లు రవ్వంతైనా రుజువు ఉందా? ఒక్కటి అనకుండా అవన్నీ సమగ్రసంపూర్ణ ఆయుధ విస్తృతీకరణలో నిమగ్నమై యుండలేదా?

సామ్రాజ్యవాదుల ఆయుధ విస్తృతీకరణను, యుద్ధ సన్నాహాలను బట్టబయలు చేయాలన్నా, రూపుమాపాలన్నా సమగ్ర నిరాయుధీకరణకై ప్రతిపాదన చేయడం అవసరమని మేము ఎల్లప్పుడూ వాదిస్తూనే ఉన్నాము. అంతేకాదు. సోషలిస్టు దేశాల, యావత్తు ప్రపంచ ప్రజల సమిష్టి పోరాటం ద్వారా, నిరాయుధీకరణ సమస్యపై ఏదో ఒక ఒప్పందానికి వచ్చేట్లు సామ్రాజ్యవాదాన్ని వత్తిడిపెట్టడం సాధ్యమవుతుంది. ఎవరైనా సమగ్ర, సంపూర్ణ నిరాయుధీకరణను ప్రపంచ శాంతికి ప్రధాన మార్గంగా లెక్కిస్తే, సామ్రాజ్యవాదం తనంతట తానే ఆయుధాలు కిందపెడుతుందనే భ్రమను వ్యాపింపజేస్తే, నిరాయుధీకరణ సాకుతో పీడితప్రజల, పీడితజాతుల విప్లవ పోరాటాలను తుడిచివేయడానికి ప్రయత్నిస్తే, ఇది బుద్ధిపూర్వకంగానే ప్రపంచ ప్రజలను మోసగించినట్లు అవుతుంది;

దురాక్రమణ, యుద్ధ విధానాలలో సామ్రాజ్యవాదులకు తోడ్పడినట్లే అవుతుంది.

యుద్ధమూ, శాంతి సమస్యపై అంతర్జాతీయ, కార్మిక వర్గ ఉద్యమంలో నేడున్న సిద్ధాంత గందరగోళాన్ని అధిగమించాలంటే, ఆధునిక రివిజనిస్టులు విసర్జించిన లెనిన్ సిద్ధాంతాన్ని పునరుద్ధరించాలని మా అభిప్రాయం. సామ్రాజ్యవాదుల దురాక్రమణ, యుద్ధ విధానాలను రూపుమాపడానికి, ప్రపంచశాంతి పరిరక్షణకు ఇది అవసరం.

ప్రపంచ ప్రజలు ఏకకంఠంగా నూతన ప్రపంచయుద్ధాన్ని నిరోధించ గోరుతున్నారు. నూతన ప్రపంచ యుద్ధాన్ని నిరోధించడం సాధ్యమే.

అలాంటప్పుడు, ప్రపంచశాంతి సాధనకు మార్గమేమిటి? అనేదే సమస్య. లెనినిస్టు దృక్పథం ప్రకారం, అన్ని దేశాల లోని ప్రజల పోరాటాలద్వారా మాత్రమే పపంచ శాంతిని సాధించవచ్చు. అంతేకాని సామ్రాజ్య వాదులను బ్రతిమాలుకోవడం ద్వారా కాదు. సోషలిస్టు శిబిరంయొక్క బలాన్ని అభివృద్ధి పరచడం, అన్ని దేశాల శ్రామికవర్గంయొక్క, కార్మిక ప్రజానీకంయొక్క విప్లవ పోరాటాలు, పీడితజాతుల విముక్తి పోరాటాలు, శాంతికాముకులైన ప్రజలందరి, శాంతికాముక దేశాలన్నిటి పోరాటాలపై ఆధారపడటం ద్వారా మాత్రమే ప్రపంచశాంతిని గట్టిగా కాపాడవచ్చు.

ఇది లెనినిస్టు విధానం. తద్వ్యతిరేకమైన విధానం ఏదైనా ఖచ్చితంగా ప్రపంచశాంతికి దారితీయదు. పైపెచ్చు,

సామ్రాజ్య వాదుల అభీష్టాలను మాత్రమే ప్రోత్సహిస్తుంది. ప్రపంచయుద్ధ ప్రమాదాన్ని అధికం చేస్తుంది.

ఇటీవలి సంవత్సరాలలో, కొందరు వ్యక్తులు, జాతీయ విముక్తి యుద్ధంనుండి గాని, విప్లవ ప్రజాయుద్ధంనుండి గాని ఒక నిప్పురవ్వ అయినా మానవజాతిని నాశనంచేసే ప్రపంచ మారణహోమానికి దారితీయగలదనే వాదనను వ్యాపింపజేస్తున్నారు. వాస్తవాలేమిటి? ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం జరిగిన జాతీయ విముక్తి యుద్ధాలు, విప్లవ ప్రజాయుద్ధాలు ప్రపంచయుద్ధానికి దారితీయ లేదనేది ఈ వ్యక్తులు చెప్పేదానికి విరుద్ధం. ఈ విప్లవ యుద్ధాల విజయం సామ్రాజ్యవాద శక్తులను ప్రత్యక్షంగా బలహీనపరచింది. ప్రపంచయుద్ధం తీసుకురాకుండా సామ్రాజ్యవాదులను నిరోధించే, ప్రపంచ శాంతిని బలపరిచే శక్తులను చాలా పటిష్ఠంచేసింది. అలాంటప్పుడు ఈ వాదన ఎంత బేసబబైనదో వాస్తవాలు రుజువు చేయడం లేదా?

(15) అణ్వాయుధాలను పూర్తిగా నిషేధించడం, నాశనం చేయడం ప్రపంచశాంతి పరిరక్షణకు జరిగే పోరాటంలో ప్రధాన కర్తవ్యం. ఇందుకోసం మనం శాయశక్తులా కృషి చేయాలి.

అణ్వాయుధాలు కని విని ఎరుగనంతటి నష్టం కలిగిస్తాయి. అందుచేతనే ఇప్పటికి పదేళ్ళకు పైగా అమెరికా సామ్రాజ్యవాదులు అణ్వాయుధాలతో బెదరించే విధానాన్ని అనుసరిస్తున్నారు. అన్ని దేశాల ప్రజలను బానిసత్వంలోముంచి

ప్రపంచాధిపత్యం నెరపాలనే కోర్కెను సిద్ధింప జేసుకోవడం వారి ఉద్దేశం.

అయితే సామ్రాజ్యవాదులు అణ్వాయుధాలతో ఇతర దేశాలను బెదరిస్తున్నారంటే, తమ స్వదేశంలోని ప్రజలను అదేవిధమైన బెదరింపుకు గురిచేస్తున్నారన్న మాట. ఈ విధంగా వారిని అణ్వాయుధాలకు వ్యతిరేకంగా, సామ్రాజ్యవాదుల దురాక్రమణ, యుద్ధ విధానాలకు వ్యతిరేకంగా తయారుచేస్తున్నారన్నమాట. ఇదే సందర్భంలో, అణ్వాయుధాలతో తమ ప్రత్యర్థులను రూపుమాపాలనే అడియాసతో, సామ్రాజ్యవాదులు వాస్తవంలో స్వయంగా రూపుమాసిపోయే ప్రమాదాన్ని తెచ్చిపెట్టుకొంటున్నారు.

అణ్వాయుధాలనునిషేధించే అవకాశంలేనిమాటనిజమే. అయినప్పటికి, అణ్వాయుధాల నిషేధానికై సామ్రాజవాదులు తప్పనిసరిగా ఒకఒప్పందానికి రావలసివస్తే, అదివారికి "మానవ జాతిపట్ల ఉన్నప్రేమ" చేతకాకుండా, అన్నిదేశాల ప్రజల వొత్తిడి, తమప్రధాన ప్రయోజనాల కారణంగానే అనేది నిశ్చయం.

సామ్రాజ్యవాదులవలె కాకుండా, సోషలిస్టుదేశాలు ప్రజలయొక్క నిజమైన బలంపైన, తమ సరిఅయిన విధానాల పైన ఆధారపడతాయి. అవి అంతర్జాతీయరంగంలో అణ్వాయుధాలతోజూదం ఆడవలసిన అవసరం లేనేలేదు. సోషలిస్టు దేశాలకు అణ్వాయుధాలు ఉన్నాయంటే, ఆత్మరక్షణకు, అణుయుద్ధం తీసుకురాకుండా సామ్రాజ్యవాదాన్ని నిరోధించడానికి మాత్రమే.

మార్క్సిస్టు-లెనినిస్టుల దృక్పథంలో, ప్రజలేచరిత్రనిర్మాతలు. గతంలోవలె నేడుకూడ మానవుడే నిర్ణాయకశక్తి. సాంకేతిక విజ్ఞానరంగంలో పరివర్తనకు మార్క్సిస్టు-లెనినిస్టులు ప్రాధాన్యతఇస్తారు. అయితే మానవునిపాత్రను కించపరచి, సాంకేతిక విజ్ఞానపాత్రకు ఆధిక్యత కల్పించడంతప్పు.

అణ్వాయుధాల అవతరణ మానవచరిత్ర పురోగతిని అడ్డగించనూలేదు, సామ్రాజ్యవాదవ్యవస్థ రూపుమాసిపోకుండా కాపాడనూలేదు. గతంలో నూతనసాంకేతిక పద్ధతులు ఎన్ని ప్రవేశపెట్టినా పాతవ్యవస్థలను రూపుమాసిపోకుండా కాపాడలేక పోయాయి.

అణ్వాయుధాల అవతరణ సమకాలిక ప్రపంచంలో ప్రధానమైన వైరుధ్యాలను పరిష్కరించడమూలేదు, పరిష్కరించనూలేదు; వర్గపోరాట నియమాన్ని తలక్రిందులు చేయడమూలేదు; చేయనూలేదు; సామ్రాజ్యవాదంయొక్క, అభివృద్ధి నిరోధకత్వంయొక్క స్వభావాన్ని మార్చడమూలేదు, మార్చనూలేదు.

కాబట్టి, అణ్వాయుధాలఅవతరణతో సామాజిక, జాతీయ విప్లవాలకుఅవకాశమూ, అవసరమూ అదృశ్యమైపోయిందని గాని, మార్క్సిజం-లెనినిజంయొక్క మౌలికసూత్రాలకు, ముఖ్యంగాశ్రామికవర్గవిప్లవం, శ్రామికవర్గ నియంతృత్వం, యుద్ధమూ-శాంతిసూత్రాలకు కాలదోషంపట్టిందని, అవి బూజుపట్టిన "పిడిసూత్రాలు"గా మారిపోయినవనిగాని చెప్పకూడదు.

(16) సోషలిస్టు దేశాలు పెట్టుబడిదారీ దేశాలతో శాంతియుతసహజీవనం నెరపడం సాధ్యమేననే సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టినవాడు లెనిన్. సోవియట్ మహాప్రజలు విదేశసాయుధ జోక్యాన్ని తిప్పికొట్టినతర్వాత సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రభుత్వము మొదట్లో లెనిన్ నాయకత్వాన, ఆపిమ్మట స్టాలిన్ నాయకత్వాన, శాంతియుత సహజీవనవిధానాన్ని నిలకడగా అనుసరించారనేవిషయం, జర్మనీ సామ్రాజ్యవాదులు దాడిచేసినప్పుడుమాత్రమే ఆత్మరక్షణకోసం వారుయుద్ధంచేయవలసివచ్చిందనేవిషయం జగద్విదితం.

చైనాప్రజారిపబ్లిక్ ఏర్పడినప్పటినుండి, అదికూడ వేర్వేరు సామాజికవ్యవస్థలుగలదేశాలతో శాంతియుతసహజీవనవిధానాన్ని నిలకడగా అనుసరించింది. శాంతియుతసహజీవనానికి సంబంధించి పంచశీలసూత్రాలను ప్రవేశపెట్టింది చైనాయే.

అయినప్పటికీ, కొద్దిసంవత్సరాలక్రితం, కొందరు వ్యక్తులు ఆకస్మికంగా, లెనిన్ శాంతియుత సహజీవనవిధానాన్ని తామే త్రివ్వితీసినట్లు దానినొక "మహాన్వేషణ"గా చెప్పుకొన్నారు. ఈవిధానాన్నివిపులంగా వ్యాఖ్యానించడం తమ గుత్తసొమ్మయినట్లు వారువాదిస్తున్నారు. "శాంతియుత సహజీవనం"అంటేఆకాశంనుండి ఊడిపడ్డసర్వవిషయసంగ్రహమైన, గోప్యమైన గ్రంథంగాలెక్కిస్తున్నారు. ప్రపంచప్రజలు పోరాటంద్వారాసాధించే ప్రతివిజయాన్నీ దీనికే అంటగడుతున్నారు. అంతేకాదు; లెనిన్ దృక్పథాలకు తాముచేసే వక్ర

భాష్యాలతో ఏకీభవించనివారినందరినీ శాంతియుతసహజీవనానికి శతృవులుగా, లెనిన్‌ను లెనినిజాన్నిబొత్తిగా ఎరుగని అజ్ఞానులుగా, సమయందొరికినప్పుడు చురకలుతగిలించదగిన వితండవాదులుగా చిత్రిస్తున్నారు.

చైనా కమ్యూనిస్టులు ఈదృక్పథంతో, ఈపద్ధతితో ఎలా ఏకీభవించగలరు? వారు ఏకీభవించలేరు. ఇది అసాధ్యమైన విషయం.

లెనిన్ శాంతియుత సహజీవన సూత్రంచాలా స్పష్టంగా సామాన్య ప్రజలు అవగాహన చేసుకొనే విధంగా ఉంది. శాంతియుత సహజీవనం వేర్వేరు సామాజిక వ్యవస్థలు గల దేశాలమధ్య సంబంధాన్ని సూచిస్తుంది. దీనికి తమ ఇష్టము వచ్చినట్లు భాష్యం చెప్పకూడదు. పీడిత జాతులకు, పీడక జాతులకు మధ్య, పీడితదేశాలకు – పీడకదేశాలకు మధ్య లేదా పీడిత వర్గాలకు, పీడక వర్గాలకు మధ్య సంబంధాలకు వర్తింపచేట్లు దీనిని ఎప్పటికీ విస్తరింప జేయకూడదు. పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తనలో ప్రాధాన్యత వహించే విషయమని దీనిని ఎప్పటికీ వర్ణించకూడదు. సోషలిజానికి మానవజాతి పంథా "శాంతియుత సహజీవనము" అని నొక్కి చెప్పడం అంతకంటే తగదు. కారణ మేమిటంటే, వేర్వేరు సామాజిక వ్యవస్థలుగల దేశాల మధ్య శాంతియుత సహజీవనాన్ని ఆచరించడం ఒక ఎత్తు. శాంతియుత సహజీవనాన్ని ఆచరిస్తున్న దేశాలు ఒకదాని సామాజిక వ్యవస్థలో మరొకటి జోక్యం కల్పించుకోవడం

సుతరామూ అనుమతింప దగిందికాదు. అది పూర్తిగా అసాధ్యమైన విషయం. వివిధ దేశాలలో వర్గపోరాటం, జాతీయ విముక్తి కోసం పోరాటం, పెట్టుబడి దారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తన ఇంకోఎత్తు. అవన్నీ సామాజిక వ్యవస్థను మార్చడానికి ఉద్దేశించిన కఠోర, జీవన్మరణ విప్లవప్రజా పోరాటాలు. ఏ దేశంలోనైనా పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తన, ఆ దేశంలో శ్రామికవర్గ విప్లవం, శ్రామికవర్గ నియంతృత్వంద్వారామాత్రమేసాధ్యంకాగలదు.

శాంతియుత సహజీవన విధానాన్ని వర్తింప చేయడంలో, రాజకీయ, ఆర్థిక, సిద్ధాంత రంగాలలో సోషలిస్టు సామ్రాజ్యవాద దేశాలమధ్య పోరాటాలు అనివార్యం. "సమగ్ర సహకారము" పొందడం పూర్తిగా అసంభవం.

సోషలిస్టు దేశాలు సామ్రాజ్యవాద దేశాలతో ఏదో ఒక విధమైన సంప్రదింపులు జరపడం అవసరమవుతుంది. సోషలిస్టు దేశాలు సరిఅయిన విధానాలకు కట్టుబడి ఉన్నందు వల్ల, అన్ని దేశాల ప్రజల వత్తిడివల్ల, సంప్రదింపులద్వారా కొన్ని ఒప్పందాలు కుదుర్చుకోవడం సాధ్యమవుతుంది. అయితే సోషలిస్టు దేశాలకుసామ్రాజ్యవాద దేశాలకు మధ్య అవసరమైన రాజీ ఒప్పందాలను పీడితప్రజలు, పీడితజాతులు అనుసరించి, సామ్రాజ్యవాదంతోను, దానితాబేదార్లతోను రాజీపడవలసిన అగత్యంలేదు. శాంతియుత సహజీవనంపేరిట తమవిప్లవ పోరాటాలను వదలిపెట్టమని పీడితప్రజలను, పీడిత దేశాలను ఎవ్వరూ కోరకూడదు.

సోషలిస్టు దేశాలువర్తింపజేస్తున్న శాంతియుత సహజీవన విధానం సోషలిస్టునిర్మాణంనిమిత్తం, సామ్రాజ్యవాదులదురాక్రమణ,యుద్ధవిధానాలను బట్టబయలుచేసేనిమిత్తం, దురాక్రమణను, యుద్ధాన్నికోరే సామ్రాజ్యవాదశక్తులను వేరుపరచేనిమిత్తం అంతర్జాతీయంగా శాంతియుతవాతావరణాన్ని సాధించడానికి అనుకూలంగాఉంటుంది. కాని సోషలిస్టుదేశాల విదేశాంగవిధానంయొక్క సాధారణపంథా శాంతియుతసహజీవనానికే పరిమితమైపోతే, సోషలిస్టు దేశాలమధ్య సంబంధాలనుగాని, సోషలిస్టుదేశాలకు, పీడితప్రజలకు, పీడితదేశాలకుమధ్య సంబంధాలనుగాని సక్రమంగాఉంచుకోవడం అసాధ్యమవుతుంది. కాబట్టిశాంతియుతసహజీవనాన్ని సోషలిస్టుదేశాల విదేశాంగవిధానంయొక్క సాధారణపంథాగా చేయడంతప్పు.

సోషలిస్టుదేశాల విదేశాంగవిధానంయొక్క సాధారణపంథా ఈదిగువవిధంగా ఉండాలని మాఅభిప్రాయం. శ్రామికవర్గఅంతర్జాతీయతా సూత్రంప్రకారం సోషలిస్టుశిబిరంలోని స్నేహసంబంధాలను, పరస్పరసహాయాన్ని సహకారాన్ని పెంపొందించుకోవడం; పంచశీలసూత్రాల ప్రాతిపదికపై, వేర్వేరు సామాజికవ్యవస్థలుగలదేశాలతో శాంతియుతసహజీవనానికి కృషిచేయడం, సామ్రాజ్యవాదుల దురాక్రమణ,యుద్ధవిధానాలను వ్యతిరేకించడం; పీడితప్రజలందరి, పీడితదేశాలన్నిటి విప్లవపోరాటాలకు తోడ్పాటు, సహాయం అందజేయడము. ఈమూడువిషయాలు పరస్పరసంబంధంకలిగి, అవిభాజ్యంగా ఉన్నాయి. ఇందులో ఏఒక్కఅంశాన్ని తొలగించకూడదు.

(17) శ్రామికవర్గం అధికారాన్ని హస్తగతంచేసుకొన్న తర్వాత చాలాసుదీర్ఘమైన చారిత్రకదశదాకా, మానవుని ఇష్టాయిష్టాలతోనిమిత్తం లేకుండా, వర్గపోరాటం ఒకభౌతికనియమంగా కొనసాగుతుంది. అధికారాన్ని హస్తగతంచేసుకోక పూర్వం ఉన్నపద్ధతిలోమాత్రమే మార్పుఉంటుంది.

అక్టోబరువిప్లవానంతరం లెనిన్ ఈదిగువ విషయాలను పదేపదేఉద్ఘాటించాడు.

అ) అధికారం నుండి దింపివేయబడిన దోపిడీదార్లు తాముకోల్పోయిన "స్వర్గాన్ని" తిరిగిరాబట్టుకోవడానికి సహస్రవిధాల నిరంతరం ప్రయత్నిస్తారు.

ఆ) పెట్టుబడిదారీవిధానంయొక్క నూతనశక్తులు పెట్టీ-బూర్జువా వాతావరణంలో ఎడతెగకుండా, తమంతటతామే ఉత్పత్తి అవుతాయి.

ఇ) బూర్జువావర్గంయొక్క పలుకుబడి, పెట్టీబూర్జువా వర్గంచే వ్యాపింపజేయబడిన కలుషితవాతావరణం ఫలితంగా రాజకీయపతితులు, నూతనబూర్జువాశక్తులు కార్మికకార్యకర్తలలోను, ప్రభుత్వఉద్యోగులలోను బయలుదేరవచ్చు.

ఈ) సోషలిస్టుదేశంలోపల వర్గపోరాటాన్ని కొనసాగించడానికి బాహ్యపరిస్థితులు ఏవంటే: అంతర్జాతీయ పెట్టుబడిదారీవిధానం వలయంపన్నిఉండటం, సామ్రాజ్యవాదులు సాయుధజోక్యం కల్పించుకొనే ప్రమాదం, శాంతియుతవిభజనలో విజయసాధనకై వారివిచ్ఛిన్నకర్యకలాపాలు.

లెనిన్ చేసిన ఈనిర్ణయాలను జీవితానుభవం ధ్రువపర చింది.

సోషలిస్టు పారిశ్రామికీకరణ, వ్యవసాయిక సమిష్టి కరణ తర్వాత దశాబ్దాల పాటు లేదా ఇంకా ఎక్కువకాలం పాటు, ఏసోషలిస్టు దేశమైనా, లెనిన్ పదేపదే ఖండించిన బూర్జువా తాబేదార్లు, పరాన్నభుక్కులు, చట్టావ్యాపారులు, జేబుదొంగలు, సోమరిపోతులు, రౌడీలు, ప్రభుత్వ ధనాపహర్తల వంటి శక్తులనుండి విముక్తి పొందుతుందని గాని; లెనిన్ చెప్పినట్లు "పెట్టుబడి దారీ విధానంనుండి సోషలిజానికి సంక్రమించిన ఈఅంటు జాడ్యాన్ని, ఈప్లేగును ఈకురుపును" జయించే కర్తవ్యాన్ని ఒక సోషలిస్టు దేశం నెరవేర్చ వలసిన అవసరం ఉండబోదనిగాని, వదలిపెట్టగల స్థితిలో ఉంటుందని గాని చెప్పడం అసంభవం.

ఒకసోషలిస్టు దేశంలో, సోషలిజమా లేక పెట్టుబడి దారీ విధానమా-ఇందులో ఏది జయిస్తుందనే సమస్యను క్రమేణా పరిష్కరించడానికి చాలా సుదీర్ఘ చారిత్రకకాలం పడుతుంది. సోషలిస్టు పంథాకు, పెట్టుబడిదారీ పంథాకుమధ్య పోరాటం ఈయావత్తు చారిత్రక కాలంలో కొనసాగుతుంది. ఈపోరాటం ఒకతరంగంవలె లేస్తుంది, పడిపోతుంది; ఒక్కొక్కప్పుడు ఇదిచాలాతీవ్రంగాఉంటుంది; పోరాటపద్ధతులు ఎన్నో రకాలుగాఉంటాయి.

"కార్మికవర్గంఅధికారాన్ని హస్తగతం చేసుకోవడం విప్లవానికి ప్రారంభంమాత్రమేగాని ముగింపుకాదు" అని 1957

ప్రకటన సరిగానే పేర్కొన్నది.

శ్రామికవర్గనియంతృత్వకాలంలో వర్గపోరాటంయొక్క ఉనికిని, ఆర్థిక, రాజకీయ, సిద్ధాంతరంగాలలో సోషలిస్టు విప్లవాన్నిసంపూర్ణంగా సమాప్తంచేయవలసిన అవసరాన్నినిరాకరించడంతప్పు. ఇదిభౌతికవాస్తవానికి అనుగుణమైనదికాదు. ఇదిమార్క్సిజం-లెనినిజాన్ని ఉల్లంఘిస్తుంది.

(18) కమ్యూనిస్టుసమాజంయొక్క ఉన్నతదశ ఏర్పడటానికి ముందుకాలం యావత్తు పెట్టుబడిదారీ విధానంనుండి కమ్యూనిజానికి పరివర్తనచెందేకాలమని, శ్రామికవర్గనియంతృత్వకాలమని మార్క్స్, లెనిన్‌లు ఇద్దరూచెప్పారు. ఈపరివర్తనదశలో, శ్రామికవర్గనియంతృత్వం, అంటే శ్రామికవర్గ ప్రభుత్వం, స్థాపించడం, ఏకీకరణచేయడం, పటిష్ఠంచేయడం, సమయింపజేయడం అనే గతితర్కపద్ధతిలో సాగిపోతుంది.

"దిక్రిటిక్ ఆఫ్‌గోథేప్రోగ్రాం"లో మార్క్సుఈసమస్యను దిగువవిధంగా పేర్కొన్నాడు: "పెట్టుబడిదారీ, కమ్యూనిస్టు సమాజంమధ్య ఒకదాని విప్లవపరివర్తనదశ ఇంకొకదానిలో ప్రవేశిస్తుంది. దీనికిఅక్కడకూడ, ప్రభుత్వంఅంటే శ్రామివర్గ విప్లవనియంతృత్వంతప్ప మరొకటికాని రాజకీయపరివర్తనదశ వర్తిస్తుంది." ("సెలక్టడ్‌వర్క్సుఆఫ్‌మార్క్స్అండ్‌ఏంగెల్స్" (రెండుసంపుటాలప్రతి). పుట 31, సంపుటం 2, 1961లో పీపుల్స్‌పబ్లిషింగ్‌హౌస్ ప్రచురించింది).

శ్రామికవర్గనియంతృత్వాన్నిగూర్చి మార్క్స్‌చేసిన మహాసిద్ధాంతాన్ని లెనిన్‌తరచు నొక్కిచెప్పాడు. ఈసిద్ధాంత

పరిణామాన్ని. ముఖ్యంగా "ది స్టేట్ అండ్ రివల్యూషన్" అనే ప్రఖ్యాత గ్రంథంలో విపులీకరించాడు. అందులో ఆయన ఇలా వ్రాశాడు: "... ...కమ్యూనిజం వైపు పురోగమిస్తున్న పెట్టుబడిదారీసమాజంనుంచి కమ్యూనిస్టుసమాజానికి పరివర్తన ఒక 'రాజకీయపరివర్తనదశ' లేనిదే అసంభవం. ఈదశలో ప్రభుత్వం శ్రామికవర్గవిప్లవ నియంతృత్వంగా మాత్రమే ఉండగలదు." ("లెనిన్ సంపూర్ణరచనలు" పుట 446, సంపుటి 25).

ఆయన ఇంకా ఇలా చెప్పాడు. "ప్రభుత్వాన్ని గూర్చి మార్క్స్ ఉపదేశ సారాంశాన్ని, ఏకవర్గ నియంతృత్వం మొత్తమీద ప్రతివర్గసమాజానికి మాత్రమే కాకుండా, బూర్జువావర్గాన్ని కూలదోసిన శ్రామికవర్గానికి మాత్రమే కాకుండా వర్గరహితసమాజంనుండి, కమ్యూనిజంనుండి పెట్టుబడిదారీ విధానాన్ని వేరుపరచే చారిత్రకదశకంతటికీ అవసరమనే అవగాహన గలవారుమాత్రమే ఆకళింపు చేసుకొంటున్నారు." ("లెనిన్ సంపూర్ణరచనలు" పుట 400. సంపుటి 25)

పైన పేర్కొన్నట్లు, మార్క్స్, లెనిన్‌ల మౌలికసిద్ధాంతం ఏమిటంటే, శ్రామికవర్గ నియంతృత్వం, పెట్టుబడిదారీవిధానం నుండి కమ్యూనిజానికి పరివర్తనచెందే చారిత్రకదశకంతటికీ, అంటే, వర్గభేదాలన్నీ రద్దుఅయి, వర్గరహితసమాజంలో, కమ్యూనిస్టుసమాజంయొక్క ఉన్నతదశలో ప్రవేశించేవరకు గల దశకంతటికీ అనివార్యంగా వర్తిస్తుంది.

సగందారిలో ఉండగానే, శ్రామికవర్గనియంతృత్వం ఇక మీదట, అవసరం లేదని ప్రకటిస్తే ఏమవుతుంది ?

శ్రామికవర్గనియంతృత్వాధికారాన్నిగూర్చి మార్క్సు, లెనిన్‌ల ఉపదేశాలకు ఇది మౌలికంగానే విరుద్ధంకాదా?

"పెట్టుబడిదారీవిధానంనుండి సోషలిజానికి సంక్రమించిన ఈఅంటుజాడ్యమూ, ఈప్లేగు, ఈకురుపు" అభివృద్ధి చెందడానికి ఇది లైసెన్సు ఇవ్వదా?

మరొకమాటలోచెప్పాలంటే, ఇది ఎన్నోదుష్ఫలితాలకు దారితీస్తుంది. కమ్యూనిజానికి పరివర్తన అనేసమస్యే లేకుండా చేస్తుంది.

"యావన్మంది ప్రజలప్రభుత్వం"అనేది ఉండగలదా? శ్రామికవర్గ నియంతృత్వప్రభుత్వస్థానంలో "యావన్మంది ప్రజలప్రభుత్వాన్ని" ఏర్పరచడం సాధ్యమేనా?

ఇదిఒకానొకదేశంయొక్క- ఆంతరంగిక వ్యవహారాలకు సంబంధించిన సమస్యకాదు. మార్క్సిజం-లెనినిజంయొక్క- విశ్వజనీన సత్యానికి వర్తించే మౌలికసమస్య.

వర్గరహిత ప్రభుత్వం అనేదిగాని, వర్గాతీతప్రభుత్వం అనేదిగానిలేదని మార్క్సిస్టు-లెనినిస్టులఅభిప్రాయం. ప్రభుత్వం ఒకప్రభుత్వంగా ఉన్నంతకాలమూ, దానికి ఒకవర్గస్వభావం ఉండాలి; ప్రభుత్వంఉన్నంతకాలమూ, అది "యావన్మంది ప్రజల" ప్రభుత్వంగాఉండజాలదు. సమాజంవర్గరహితమైన వెంటనే, ప్రభుత్వం అనేది ఉండబోదు.

అప్పుడు "యావన్మంది ప్రజలప్రభుత్వం" ఏరకంగా ఉంటుంది?

"యావన్మందిప్రజలప్రభుత్వం" అని చెప్పబడేదికొత్త

విషయమేమీకాదని మార్క్సిజం-లెనినిజంయొక్క ప్రాథమిక జ్ఞానం ఉన్నవారెవరైనా అర్థంచేసుకోగలరు. బూర్జువాప్రతినిధులు బూర్జువాప్రభుత్వాన్ని ప్రజలందరిప్రభుత్వంఅనిగాని "ప్రజలందరికి అధికారం ఉన్నప్రభుత్వం" అనిగాని పిలుస్తూవచ్చారు.

కొందరువ్యక్తులు తమసమాజం అప్పుడే వర్గరహితమైందనిచెప్పవచ్చు. ఇందుకు మా సమాధానమేమిటంటే: లేదుఅని. మినహాయింపులేకుండా అన్నిసోషలిస్టు దేశాలలోను వర్గాలు, వర్గపోరాటాలు ఉన్నాయి.

మిగిలిపోయినపాతదోపిడీవర్గాలు పునఃప్రవేశించడానికై ఇప్పటికీ ప్రయత్నిస్తూనేఉన్నారు. నూతన పెట్టుబడిదారీశక్తులు నిరంతరం ఉత్పత్తి అవుతూనేఉన్నాయి. ఇప్పటికీ పరాన్నభుక్కులు, చట్టావ్యాపారులు, సోమరిపోతులు, కాడీలు, ప్రభుత్వ ధనాపహర్తలు మొదలైనవారు ఉన్నారు. అలాంటప్పుడు వర్గాలుగాని, వర్గపోరాటాలుగాని లేవని ఎలా చెప్పగలం? శ్రామికవర్గ నియంతృత్వం ఇకమీదట అవసరంలేదని ఎలా చెప్పగలం?

శత్రువర్గాలను అణచివేయడంతోబాటు, సోషలిస్టు నిర్మాణదశలో, కార్మికవర్గానికి రైతాంగానికిమధ్య చక్కని సంబంధాలను ఏర్పాటుచేయడం, వారిరాజకీయ, ఆర్థికమైత్రిని పటిష్ఠంచేయడం, కార్మికునికి రైతుకుమధ్య వర్గభేదాన్ని క్రమేణా రూపుమాపడానికి తగుపరిస్థితులను సృష్ఠించడం శ్రామికవర్గనియంతృత్వం తప్పనిసరిగా నిర్వహించవలసినచారిత్రక కర్తవ్యాలని మార్క్సిజం-లెనినిజం మనకు బోధిస్తుంది.

మనం ఏ సోషలిస్టుదేశంయొక్క ఆర్థికపునాదినిఅయినా పరిశీలించినప్పుడు, ఎలాంటి మినహాయింపులేకుండా, అన్ని సోషలిస్టుదేశాలలో యావన్మందిప్రజల యాజమాన్యానికి, సమిష్టియాజమాన్యానికి మధ్యభేదం ఉన్నట్లు, వ్యక్తిగత యాజమాన్యంకూడ అక్కడఉన్నట్లు కనిపిస్తుంది. సోషలిస్టు సమాజంలో యావన్మంది ప్రజలయాజమాన్యమూ, సమిష్టియాజమాన్యమూ రెండువిధాలైన యాజమాన్యాలు, రెండువిధాలైన ఉత్పత్తి సంబంధాలు. సోషలిస్టు సమాజంలో యావన్మందిప్రజల యాజమాన్యంగల వస్తూత్పత్తి సంస్థలలో పని చేసే కార్మికులూ, సమిష్టి యాజమాన్యంగల వ్యవసాయ క్షేత్రాలలోపనిచేసేరైతులూ శ్రమజీవులలో రెండువేర్వేరు వర్గీకరణాల (కేటగరీలు)కు చెందుతారు. కాబట్టి, మినహాయింపుఅనేదిలేకుండా అన్నిసోషలిస్టుదేశాలలో కార్మికునికి, రైతుకుమధ్య వర్గభేదం ఉంది. కమ్యూనిజంయొక్క ఉన్నత దశకు పరివర్తనజరిగేదాకా ఈభేదం తొలగిపోదు. అన్నిసోషలిస్టుదేశాలు తమప్రస్తుత ఆర్థికాభివృద్ధిస్థాయిలో కమ్యూనిజం యొక్క ఉన్నతదశకు చాలాదూరంలో ఉన్నాయి. "ప్రతి ఒక్కరూ తనశక్తికొద్దీ పనిచేయాలి, ప్రతిఒక్కరూ తనఅవసరంకొద్దీ అనుభవించాలి." అనేసూత్రం ఆచరణలోకి వచ్చే ఉన్నతదశఅది. కాబట్టి, కార్మికునికి, రైతుకుమధ్య వర్గభేదాన్ని రూపుమాపడానికి చాలాసుదీర్ఘకాలం పడుతుంది. ఈభేదాన్ని రూపుమాపేదాకా, సమాజం వర్గరహితమైనదనిగాని, శ్రామిక వర్గ నియంతృత్వానికి అవసరం తీరిపోయిందనిగాని చెప్పడం అసంభవం.

సోషలిస్టు ప్రభుత్వాన్ని "యావన్మంది ప్రజల ప్రభుత్వం" అని పిలిచేవారు మార్క్సిస్టు-లెనినిస్టు ప్రభుత్వసిద్ధాంత స్థానంలో బూర్జువా ప్రభుత్వ సిద్ధాంతాన్ని పునఃప్రవేశపెట్ట జూస్తున్నారా? శ్రామికవర్గనియంతృత్వ ప్రభుత్వస్థానంలో వేరే స్వభావంగల ప్రభుత్వాన్ని పునఃప్రవేశపెట్టజూస్తున్నారా?

ఇదేనిజమైతే, ఇదొక గొప్పచారిత్రక తిరోగమనం తప్ప మరేమీకాదు. యుగోస్లావియాలో సామాజికవ్యవస్థకు పట్టిన క్షీణదశ ఒక పెద్ద గుణపాఠం.

(19) శ్రామికవర్గపార్టీ సోషలిస్టుదేశాలలో శ్రామికవర్గ నియంతృత్వంతో కలసిఉండాలని లెనినిజం బోధిస్తుంది. శ్రామిక వర్గపార్టీ శ్రామికవర్గ నియంతృత్వంయొక్క చారిత్రకదశకంతటికీ వర్తిస్తుంది. కారణమేమిటంటే, శ్రామికవర్గ నియంతృత్వం శ్రామికవర్గంయొక్క, ప్రజలయొక్క శత్రువులకు వ్యతిరేకంగా పోరాడవలసి ఉంటుంది. రైతులు, తదితర చిన్నఉత్పత్తిదార్లలో పునఃచైతన్యం కలిగించవలసిఉంటుంది. శ్రామికవర్గకార్యకర్తలను నిరంతరం ఐక్యపరచవలసిఉంటుంది. సోషలిజాన్ని నిర్మించి, కమ్యూనిజానికి పరివర్తన చెందించవలసి ఉంటుంది. శ్రామికవర్గపార్టీ నాయకత్వం లేనిదే ఈ పనులలో ఏ ఒక్కటి జరగదు.

"యావన్మంది ప్రజల పార్టీ" అనేది ఉండటం సాధ్యమేనా? శ్రామికవర్గానికి అగ్రగామిగా నిలబడే పార్టీస్థానంలో "యావన్మంది ప్రజల పార్టీ"ని ప్రవేశపెట్టడం సాధ్యమేనా?

ఇదికూడ ఒకానొక పార్టీయొక్క ఆంతరంగిక వ్యవహారాలకు సంబంధించిన సమస్యకాదు. పైపెచ్చు మార్క్సిజం-

లెనినిజంయొక్క విశ్వజనీనసత్యానికి వర్తించే మౌలిక సమస్య.

వర్గరహిత, వర్గాతీత రాజకీయపార్టీ అనేది ఉండదని మార్క్సిస్టు-లెనినిస్టుల అభిప్రాయం. అన్ని రాజకీయ పార్టీలకు వర్గస్వభావం ఉంటుంది. వర్గస్వభావంయొక్క కేంద్రీకృత వ్యక్తీకరణే పార్టీలో మూర్తీభవిస్తుంది.

ప్రజలందరి ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించగల పార్టీ శ్రామికవర్గపార్టీ మాత్రమే. అది ఆవిధంగా చేయగలదు. ఎందుకంటె అది శ్రామికవర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. వారి ఆశయాలను. అభీష్టాన్ని కేంద్రీకరిస్తుంది. అది ప్రజలందరికి నాయకత్వం వహించగలదు. ఎందుకంటె మానవజాతి అంతా బాగుపడినప్పుడు మాత్రమే శ్రామిక వర్గం బాగుపడగలదు. ఎందుకంటె శ్రామికవర్గం స్వభావసిద్ధంగానే, వివిధ సమస్యలను తన వర్తమాన, భవిష్యత్ ప్రయోజనాల దృష్ట్యా తన పార్టీ పరిశీలించేట్లు చేయగలదు. ఎందుకంటె ప్రజలకు ఆ పార్టీ ఎంతో నిజాయితీగా ఉంటుంది. స్వార్థత్యాగ భావంకలిగి ఉంటుంది. అందుచేత దానిలో ప్రజాస్వామ్యములో కేంద్రీకరణ, కఠినతరమైన క్రమశిక్షణ ఉంటాయి. అలాంటిపార్టీ లేనిదే, శ్రామికవర్గ నియంతృత్వాన్ని నిలబెట్టడం, ప్రజలందరి ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించడం అసంభవం.

కమ్యూనిస్టు సమాజంయొక్క ఉన్నతదశలో ప్రవేశించడానికి ముందు, సగందారిలో ఉండగానే, శ్రామికవర్గ పార్టీ "యావన్మంది ప్రజల పార్టీగా" తయారైందని ప్రక

టిస్తే, దాని శ్రామికవర్గ స్వభావాన్ని నిరాకరిస్తే, ఏమవుతుంది?

శ్రామికవర్గపార్టీ నిగూర్చి మార్క్స్, లెనిన్‌లు ఇచ్చిన ఉపదేశాలకు ఇది మౌలికంగానే విరుద్ధంకాదా ?

ఇది శ్రామికవర్గాన్ని, కార్మికప్రజానీకాన్ని, నిర్మాణ రీత్యా, సిద్ధాంతరీత్యా నిరాయుధంచేయదా? ఇది పెట్టుబడి దారీ విధానాన్ని పునరుద్ధరించడానికి తోడ్పడినట్లు కాదా?

ఇలాంటిపరిస్థితులలో కమ్యూనిస్టుసమాజానికి పరివర్తన చెందడంగూర్చి మాట్లాడటమంటే, "రథాన్ని ఉత్తరదిశగా నడుపుతూ, దక్షిణదిశకు వెళ్ళడం" కాదా ?

(20) నాయకులు, పార్టీ, వర్గమూ, ప్రజలపరస్పరసంబంధాన్నిగూర్చి లెనిన్ఇచ్చిన సాటిలేని ఉపదేశాలను, గతకొద్ది సంవత్సరాలుగా కొందరువ్యక్తులు ఉల్లఘించి, "వ్యక్తిపూజను రూపుమాపే" సమస్యను లేవనెత్తారు; ఇదితప్పు, హానికరం.

లెనిన్ప్రతిపాదించిన సిద్ధాంతం ఈదిగువ విధంగాఉంది:

అ) ప్రజలువర్గాలుగా విభజింపబడి ఉన్నారు.

ఆ) వర్గాలు మామూలుగా రాజకీయపార్టీలచే నడపబడతాయి.

ఇ) రాజకీయపార్టీలు, సాధారణంగా, అతిసమర్థులైన, ప్రతిభావంతులైన అనుభవజ్ఞులైనవారితోకూడిన, ఇంచుమించు స్థిరత్వంగల గ్రూపులద్వారానడపబడతాయి.వీరుచాలాబాధ్యతాయుతమైన పదవులకు ఎన్నికై, నాయకులని పిలువబడతారు.

"ఇదంతా ప్రాథమికమైనద"ని లెనిన్ చెప్పాడు.

శ్రామికవర్గపార్టీ విప్లవంలోను, పోరాటంలోనుశ్రామిక వర్గానికి కేంద్రంగాఉంటుంది ప్రతిశ్రామికవర్గపార్టీ ప్రజాస్వా

మ్యంపై ఆధారపడిన కేంద్రీకరణను ఆచరణలో పెట్టాలి, అది సంఘటితమైన, పోరాట అర్హతగల అగ్రగామిగా తయారయ్యే ముందు, ప్రతిష్ఠవంతమైన మార్క్సిస్టు-లెనినిస్టు నాయకత్వాన్ని స్థాపించుకోవాలి. "వ్యక్తిపూజను రూపుమాపే" సమస్యను లేవనెత్తడమంటే, వాస్తవంలో నాయకులను వ్యతిరేకించమని ప్రజలకు చెప్పడమే అవుతుంది. ప్రజాస్వామ్యయుత కేంద్రీకరణపై ఆధారపడిన పార్టీ ఐక్యనాయకత్వాన్ని బలహీనపరచడమే అవుతుంది. దాని పోరాటశక్తిని వ్యర్థపరచడమే అవుతుంది. దాని కార్యకర్తలను చెల్లాచెదరు చేయడమేఅవుతుంది.

నాయకులను వ్యతిరేకించమని ప్రజలకు చెప్పేతప్పు దృక్పథాలను లెనిన్ విమర్శించాడు. అవి "హాస్యాస్పదమైనవి, మూర్ఖత్వంతోకూడినవి" అని పేర్కొన్నాడు.

చైనాకమ్యూనిస్టుపార్టీ వ్యక్తిపాత్రకు అధిక్యత కల్పించడాన్ని ఎల్లప్పుడూ వ్యతిరేకిస్తూవచ్చింది. పార్టీలోపల ప్రజాస్వామ్యయుత కేంద్రీకరణను బలపరచుతూ,తు.చ. తప్పకుండా ఆచరణలో పెడుతూవచ్చింది. నాయకత్వానికి ప్రజానీకంతో సంబంధం ఉండాలని వాదిస్తూవచ్చింది సరిఅయిన నాయకత్వం ప్రజలదృక్పథాలను ఎలా కేంద్రీకరించాలో తెలుసుకోవాలని చెబుతూవచ్చింది.

కొందరువ్యక్తులు "వ్యక్తిపూజ" అనబడేదానిని గట్టిగా రూపుమాపుతూనే, వాస్తవంలో శ్రామికవర్గపార్టీని, శ్రామికవర్గనియంతృత్వాన్ని అపఖ్యాతిపాలు చేయడానికి తమశాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. ఇదేసందర్భంలో, వారు కొందరు వ్యక్తులపాత్రను ఆకాశానికి ఎత్తుతున్నారు. తప్పులన్నీ ఇతరుల

నెత్తికివత్తి, ఒప్పులన్నీ తమవేనని చెప్పుకొంటున్నారు.

చాలాతీవ్రమైనవిషయం ఏమిటంటే, "వ్యక్తిపూజను రూపుమాపే" నెపంతో, కొందరువ్యక్తులు మొరటుగా ఇతర సోదరపార్టీల,సోదరదేశాల ఆంతరంగికవ్యవహారాలలో జోక్యం కల్పించుకొంటున్నారు. తమ తప్పుడుపంథాను ఇతరసోదర పార్టీలపై రుద్దేనిమిత్తం, వాటి నాయకత్వాన్ని మార్చవలసిం దిగా ఆపార్టీలపై వత్తిడి తెస్తున్నారు. ఇదంతా పెద్దరాజ్యం అనే జాతిదురహంకారం, ఒంటెత్తుపోకడ, చీలికలు కల్పించే విధానంకాకపోతే మరేమిటి? ఇదంతా కాలుష్యంకాకపోతే మరేమిటి?

నాయకులూ, పార్టీ, వర్గమూ, ప్రజలపరస్పరసంబం ధాన్నిగూర్చి లెనిన్ఇచ్చిన సాటిలేని ఉపదేశాలను తీవ్రంగా, సమగ్రంగా ప్రచారంచేయవలసిన సమయం ఆసన్నమైంది

(21) సోషలిస్టుదేశాలమధ్య సంబంధాలు ఒక నూతన విధమైన అంతర్జాతీయసంబంధాలు. సోషలిస్టుదేశాలు చిన్న వైనా పెద్దవైనా, ఆర్థికంగా ఎక్కువ అభివృద్ధి చెందినవైనా, తక్కువఅభివృద్ధి చెందినవైనా, వాటిమధ్య సంబంధాలు సం పూర్ణసమానత్వం; భౌగోళిక సమగ్రత, సార్వభౌమత్వం, స్వాతంత్ర్యంపట్ల గౌరవం; ఒండొరుల ఆంతరంగిక వ్యవహా రాలలో జోక్యంకల్పించుకోకుండా ఉడటం అనేసూత్రాలపై ఆధారపడిఉండాలి. అంతేకాదు. శ్రామికవర్గ అంతర్జాతీయతకు అనుగుణంగా పరస్పర సహాయం, పరస్పర సహకారం అనే సూత్రాలపైకూడ ఆధారపడిఉండాలి.

ప్రతిసోషలిస్టుదేశమూ తననిర్మాణంకోసం ప్రధానంగా

తనపైనే ఆధారపడాలి.

తననిర్దిష్టపరిస్థితులకు అనుగుణంగా, ప్రతిసోషలిస్టు దేశమూ అన్నిటికంటెముందు, తనస్వంత ప్రజల సహనయుతమైన శ్రమశక్తి, సామర్థ్యాలపై ఆధారపడాలి. తనకు లభ్యమైన వనరులన్నిటినీ పూర్తిగా, ఒకక్రమపద్ధతిలో వినియోగించుకోవాలి. సోషలిస్టునిర్మాణంలోకి తన యావత్తుశక్తి సంపదలను తీసుకురావాలి. ఈవిధంగామాత్రమే అదిసోషలిజాన్ని జయప్రదంగా నిర్మించగలదు, తనఆర్థికవ్యవస్థను త్వరగా అభివృద్ధి పరచుకోగలదు.

యావత్తుసోషలిస్టుశిబిరంయొక్క శక్తిని పటిష్ఠంచేయడానికి, అంతర్జాతీయ శ్రామికవర్గంయొక్క విప్లవాశయానికి తోడ్పడేశక్తిని ఇనుమడింపజేసుకోవడానికి, ప్రతిసోషలిస్టుదేశానికి ఏకైకమార్గంఇదే, కాబట్టి, నిర్మాణంలో ప్రధానంగా స్వశక్తిపై ఆధారపడాలనే సూత్రాన్ని పాటించడమంటే, శ్రామికవర్గ అంతర్జాతీయతను నిర్దిష్టంగా వర్తింపజేయడమే అవుతుంది.

ఏసోషలిస్టుదేశమైనా, తన స్వీయపాక్షిక ప్రయోజనాలతోమాత్రమే బయలుదేరి, తన అవసరాలకు ఇతరసోదర దేశాలు తలబగ్గాలని ఏకపక్షంగాకోరితే, తమ నిర్మాణంలో ప్రధానంగా స్వయంకృషిపై ఆధారపడాలనే సూత్రాన్ని వర్తింపజేయనివ్వకుండా, స్వతంత్రప్రాతిపదికపై తమ ఆర్థిక వ్యవస్థలను అభివృద్ధి చేసుకోనివ్వకుండా ఇతరసోదరదేశాలను నిరోధించే నిమిత్తం, "ఏకాకిఅయిపోతున్నది," "జాతీయతత్వం" అనేపేర్లుపెట్టి, వ్యతిరేకించడానికి సాకుచూపితే, లేదా

చివరికి ఇతరసోదర దేశాలపై ఆర్థికఒత్తిడి తెచ్చేవరకూ వెళ్ళితే— ఇవి జాతీయ దురహంకారానికి చక్కని దృష్టాంతాలు అవుతాయి.

సోషలిస్టు దేశాలు ఆర్థికంగా ఒండొరుల తోడ్పాటు సహకారం, ఇచ్చిపుచ్చుకోవడాన్ని ఆచరణలో పెట్టడంచాలా అవసరం. ఇలాంటి ఆర్థిక సహకారం సంపూర్ణ సమానత్వం పరస్పరలాభం, కామ్రేడ్స్ ఇచ్చిపుచ్చుకునే సహకారసూత్రాలపై ఆధారపడి ఉండాలి.

ఈ మౌలిక సూత్రాలను నిరాకరించడమంటే "అంతర్జాతీయ శ్రమ శక్తి విభజన" పేరుతోగాని, "ప్రత్యేక నైపుణ్యసంపాదన" పేరుతోగాని తమ అభిమతాన్ని ఇతరులపైరుద్దడం, సోదరపార్టీల స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమత్వాన్ని అతిక్రమించడం, లేదా ఆ దేశాల ప్రజల ప్రయోజనాలకు హాని కలిగించడమంటే, ఇది పెద్దరాజ్యమనే జాతిదురహంకార మనిపించు కొంటుంది.

సోషలిస్టు దేశాలమధ్య సంబంధాలలో, పెట్టుబడిదారీ దేశాలమధ్య సంబంధాలలోవలె, ఇతరులను నష్టపెట్టి తాను లాభపడే పద్ధతిని అనుసరించడంగాని, మార్కెట్లను తమ గుప్పెట్లో పెట్టుకొని లాభాలుకుప్పబోసుకోవాలనే ఉద్దేశంతో గుత్త పెట్టుబడిదారీ గ్రూపులు స్థాపించిన "ఆర్థికవిలీనీకరణ" "ఉమ్మడి మార్కెట్"లను, సోషలిస్టు దేశాలు తమ ఆర్థిక సహకారం, పరస్పర సహాయంలో ఆదర్శంగా స్వీకరించాలనే దాకా వెళ్ళడంగాని హాస్యాస్పదంగా ఉంటుంది.

(22) 1957 ప్రకటనలో 1960 పత్రంలో సోదరపార్టీల మధ్య సంబంధాలకు తోడ్పడే సూత్రాలు రూపొందింపబడి ఉన్నాయి. ఇవి: సౌభ్రాతృత్వ సూత్రం, ఒండొరుల తోడ్పాటు ఒండొరులసహాయసూత్రం, స్వాతంత్ర్యం సమానత్వసూత్రం, సంప్రదింపుల ద్వారా ఏకాభిప్రాయానికి వచ్చే సూత్రం. ఇవన్నీ మార్క్సిజం-లెనినిజంపైన, శ్రామికవర్గ అంతర్జాతీయత పైన ఆధారపడి ఉన్నాయి.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ మార్చి 30వ తేదీన వ్రాసిన లేఖలో, కమ్యూనిస్టు ఉద్యమంలో "ఎక్కువ", "తక్కువ" పార్టీలు లేవని, అన్నికమ్యూనిస్టుపార్టీలు స్వతంత్ర మైనవి, సమానమైన హోదాకలవని, శ్రామికవర్గ అంతర్జాతీయత, పరస్పర సహాయం ప్రాతిపదికపై అవన్నీ తమ సంబంధాలను ఏర్పాటు చేసుకోవాలని చెప్పిన విషయాన్ని మేము గుర్తిస్తున్నాం.

తమ చేతలలోను, మాటలలోను నిలకడగా ఉండటమనేది కమ్యూనిస్టుల సుగుణం. సోదర పార్టీలమధ్య ఐక్యతను కాపాడటానికి, పటిష్ఠం చేయడానికి సరిఅయిన ఏకైకమార్గం ఏమంటే: శ్రామికవర్గఅంతర్జాతీయతా సూత్రాన్ని ఉల్లంఘించకుండా చిత్తశుద్ధితో పాటించడం, సోదర పార్టీలమధ్య సంబంధాలకు తోడ్పడే సూత్రాలను కాలరాయకుండా చిత్తశుద్ధితో అమలు జరపడం. వీటిని మాటలలో మాత్రమే కాకుండా, చేతలలో అమలు జరపడం చాలా ముఖ్యం.

సోదర పార్టీలమధ్య సంబంధాలలో స్వాతంత్ర్యం, సమానత్వ సూత్రాన్ని అంగీకరించినప్పుడు, ఏపార్టీగాని ఇత

రులకంటె తాను మిన్న అనుకోవడం, వారి అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకోవడం, వారితో సంబంధాలలో గృహ యజమాని పద్ధతులను అవలంబించడం అనుమతింప రానిది.

సోదర పార్టీలమధ్య సంబంధాలలో "ఎక్కువలు", "తక్కువలు" లేవని అంగీకరించినప్పుడు, ఒక పార్టీ తన స్వంత కార్యక్రమాన్ని, తీర్మానాలను, పంధాను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క "ఉమ్మడి పంధా" అని చెప్పి ఇతర పార్టీలపై రుద్దడం అనుమతింపరానిది.

సోదర పార్టీలమధ్య సంబంధాలలో, సంప్రదింపుల ద్వారా ఏకాభిప్రాయం సాధించే సూత్రాన్ని అంగీకరించినప్పుడు, "మెజారిటీలో ఎవరు ఉన్నారు," "మైనారిటీలో ఎవరు ఉన్నారు" అని నొక్కి చెప్పకూడదు. తమతప్పు పంధాను అమలుపరచడానికి, తమ ఒంటెత్తు పోకడలను, చీలికలు కల్పించే విధానాలను కొనసాగించడానికి మెజారిటీ అనబడే దానిపై ఆధారపడకూడదు.

సోదరపార్టీలమధ్య విభేదాలను పార్టీ ఆంతరంగిక చర్చలద్వారా పరిష్కరించుకోవాలని అంగీకరించినప్పుడు, ఇతర సోదర పార్టీలను బహిరంగంగా తమ స్వంత మహాసభలలో గాని, ఇతరపార్టి మహాసభలలోగాని, పార్టినాయకుల ప్రసంగాలు, తీర్మానాలు, ప్రకటనలు మొదలైనవాటి ద్వారా గాని విమర్శించకూడదు. సోదర పార్టీలమధ్య గల సిద్ధాంత విభేదాలను ప్రభుత్వ సంబంధాలకు వర్తింపజేయడం అంతకంటే తగదు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో భేదాభిప్రాయాలు ఉన్న నేటి పరిస్థితులలో, ప్రకటన, పత్రాలలో రూపొందింప బడినట్లు సోదరపార్టీలమధ్య సంబంధాలకు తోడ్పడే సూత్రాలకు ఖచ్చితంగా కట్టుబడి ఉండాలని నొక్కి చెప్పడం ఎంతో అవసరమని మేము అభిప్రాయ పడుతున్నాం.

సోదరపార్టీలమధ్య సంబంధాల విషయంలో, ప్రస్తుతం సోవియట్ ఆల్బేనియా సంబంధాల సమస్య ముఖ్యమైనది. ఇక్కడ సమస్య ఏమిటంటే, సోదరపార్టీపట్ల సోదర దేశంపట్ల అవలంబింపదగిన సరిఅయిన వైఖరి ఏమిటి, ప్రకటన, పత్రాలలో రూపొందింపబడినట్లు సోదరపార్టీల సోదరదేశాలమధ్య సంబంధాలకు తోడ్పడే సూత్రాలను పాటిస్తున్నారా లేదా అనేదే ఈ సమస్యకు సరిఅయిన పరిష్కారమార్గం సోషలిస్టు శిబిరంయొక్క, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క ఐక్యతను కాపాడటంలో ఎదురైన ఒక ప్రధానమైన సిద్ధాంత విషయం.

మార్క్సిస్టు-లెనినిస్టు సోదరపార్టీ అయిన ఆల్బేనియా లేబర్ పార్టీ పట్ల ఏ విధమైన వైఖరిని అవలంబించాలనేది ఒక సమస్య. మార్క్సిజం-లెనినిజానికి ద్రోహంచేసిన యుగోస్లావ్ రివిజనిస్టు ముఠాపట్ల ఏ విధమైన వైఖరి అవలంబించాలనేది పూర్తిగా మరోసమస్య. మౌలికంగానే భిన్నమైన ఈ రెండు సమస్యలను ఏ పరిస్థితులలోను సమానంగా చూడ కూడదు.

“సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీకి ఆల్బేనియా లేబర్ పార్టీకి మధ్య సంబంధాలు మెరుగు కావచ్చుననే

ఆశను వదలుకోవడంలేదు" అని మీరు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. అయితే ఇదే సమయంలో "విచ్ఛిన్న కార్యకలాపాలు" సాగిస్తున్నారని పేరుపెట్టి, ఆల్బేనియా కామ్రేడ్స్‌పై మీ దాడిని కొనసాగిస్తున్నారు. ఇది స్పష్టంగానే స్వవచన వ్యాఘాతమైనది. సోవియట్ - ఆల్బేనియా సంబంధాల సమస్యను పరిష్కరించడానికి ఇది ఏవిధంగాను తోడ్పడదు.

సోవియట్-ఆల్బేనియా సంబంధాలలో విచ్ఛిన్న చర్యలకు దిగింది ఎవరు ?

సోవియట్ - ఆల్బేనియా పార్టీల మధ్య సిద్ధాంత విభేదాలను ప్రభుత్వ సంబంధాలకు విస్తరింపజేసింది ఎవరు ?

సోవియట్-ఆల్బేనియా పార్టీలమధ్య ఈ రెండుదేశాల మధ్య సంబంధాలు తెగిపోయాయనే విషయం శత్రువుఎదుట పెట్టింది ఎవరు ?

ఆల్బేనియా పార్టీలోను, ప్రభుత్వ నాయకత్వంలోను మార్పుకోసం బహిరంగంగా పిలుపు ఇచ్చింది ఎవరు ?

ఇదంతా ప్రపంచమంతటికీ తెలుసు.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీకి నాయకత్వం వహిస్తున్న కామ్రేడ్స్ సోవియట్ - ఆల్బేనియా సంబంధాలు ఇంత తీవ్రంగా చెడిపోయినందుకు తమ బాధ్యతను వాస్తవంలో గుర్తించకుండా ఉండటం సంభవమేనా ?

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీకి నాయకత్వం వహిస్తున్న కామ్రేడ్స్, సోదరపార్టీల సోదర దేశాల మధ్య సంబంధాలకు తోడ్పడే సూత్రాలను పాటించగలరని, సోవియట్ - ఆల్బేనియా సంబంధాలు మెరుగు కావడానికితగు

మార్గం అన్వేషించడంలో చొరవ తీసుకోగలరనే హృదయపూర్వకమైన విశ్వాసాన్ని మేము మరొకసారి వెల్లడిస్తున్నాం.

ఒక్క మాటలో చెప్పాలంటే, సోదరపార్టీల, సోదర దేశాలమధ్య సంబంధాలను కాపాడే సమస్యను తీవ్రంగా పరిగణించాలి. సోదరపార్టీల, సోదర దేశాలమధ్య సంబంధాలకు తోడ్పడే సూత్రాలకు గట్టిగా కట్టువడి ఉండాలి. "మాస్కో హస్తం" గురించి సామ్రాజ్యవాదులు, అభివృద్ధి నిరోధకులు వ్యాపింపజేసిన నిందలను తిప్పికొట్టడానికి ఏకైకమార్గం ఇదే.

ఎలాంటి మినహాయింపు లేకుండా, అన్ని పార్టీలనుండి అవి చిన్నవైనా పెద్దవైనా, అవి అధికారంలో ఉన్నా లేకపోయినా-శ్రామికవర్గ అంతర్జాతీయత కోరవడుతుంది అయినప్పటికీ, పెద్ద పార్టీలకు అధికారంలో ఉన్న పార్టీలకు ఈ విషయంలో ప్రత్యేకంగా పెద్ద బాధ్యత ఉంటుంది. గతంలో సోషలిస్టు శిబిరంలో ఏర్పడిన అనేక బాధాకరమైన పరిణామాలు ఆయా సోదరపార్టీల ప్రయోజనాలకు మాత్రమే కాకుండా, వారి దేశాలలోని ప్రజానీకానికి కూడ హాని కలిగించాయి.

పెద్ద దేశం అనే జాతి దురహంకారాన్ని ఎప్పటికీ ప్రదర్శించవద్దు అని లెనిన్ ఇచ్చిన ఆదేశాన్ని పెద్దదేశాలు, పెద్ద పార్టీలు మనస్సులో ఉంచుకోవడం అవసరమని ఇది ఖచ్చితంగా రుజువు చేస్తుంది.

"సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సోదర చైనా ప్రజల పట్లగాని. ఇతర ప్రజల పట్లగాని, మా దేశ ప్రజలలో విరోధభావాన్ని రెచ్చగొట్టే

ఎలాంటి చర్యనూ ఎప్పుడూ తీసుకోలేదని, ఎప్పటికి తీసుకో బోద”ని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కామ్రేడ్స్ తమ లేఖలో పేర్కొన్నారు. గతంలో జరిగిన అనేక విచార కర సంఘటనలను ఇక్కడ పునశ్చరణచేసే ఉద్దేశం, ఉదాహ రించే ఉద్దేశం మాకులేదు. సోవియట్ యూనియన్ కమ్యూ నిస్టుపార్టీ కామ్రేడ్స్ తమ భవిష్యత్ కార్యకలాపాలలో ఈ ప్రకటనను ఖచ్చితంగా పాటించాలని మాత్రమే మేము కోరు తున్నాం.

గత కొద్దిసంవత్సరాలలో, సోదరపార్టీల, సోదరదేశాల మధ్య సం oధాలకు తోడ్పడే సూత్రాలను ఉల్లంఘించిన ఫలితంగా అనేక తీవ్ర దుర్ఘటనలు జరిగినప్పటికి, మాకుఎన్నో కష్ట, నష్టాలు కలిగించినప్పటికి, మా పార్టీ సభ్యులు, మా ప్రజలు ఎంతో ఓర్పు వహించారు. చైనాకమ్యూనిస్టుల, చైనా ప్రజల శ్రామికవర్గ అంతర్జాతీయత అగ్నిపరీక్షకు తట్టుకొని నిలబడింది.

చైనాకమ్యూనిస్టుపార్టీ శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రానికి ఖచ్చితంగా కట్టుబడి ఉంది. సోదరపార్టీల, సోదర దేశాలమధ్య సంబంధాలకు తోడ్పడే 1957 ప్రకటన, 1960 పత్రాలలోని సూత్రాలను పాటిస్తుంది, బలపరుస్తుంది. సోష లిస్టు శిబిరంయొక్క, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క ఐక్యతను కాపాడుతుంది, పటిష్ఠం చేస్తుంది.

(23) సోదరపార్టీలు ఏకగ్రీవంగా ఆమోదించిన అంత ర్జాతీయ కమ్యూనిస్టుఉద్యమ ఉమ్మడి కార్యక్రమాన్ని అమలు పరచాలంటే, మార్క్సిజం-లెనినిజానికి భిన్నమైన అన్ని అవ

కాశ వాద పద్ధతులకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం జరప వలసి ఉంది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో రివిజనిజం, మరో మాటలో చెప్పాలంటే, మితవాద అవకాశవాదం ముఖ్యమైన ప్రమాదంగా ఉందని ప్రకటన పత్రం పేర్కొంటున్నాయి. యుగోస్లావ్ రివిజనిజం ఆధునిక రివిజనిజానికి మచ్చు తునక.

పత్రంలో స్పష్టంగా ఇలా పేర్కొనబడింది: "యుగోస్లావ్ అంతర్జాతీయ అవకాశవాద పద్ధతిని, కేంద్రీకృతరూపం లో ఉన్న ఆధునిక రివిజనిస్టు 'సిద్ధాంతాల' పద్ధతిని కమ్యూనిస్టు పార్టీలు ఏకగ్రీవంగా ఖండించాయి."

అందులో ఇంకా ఇలా ఉంది: "కాలదోషం పట్టిందంటూ మార్క్సిజం-లెనినిజానికి తిలోదకాలిచ్చిన తర్వాత, యుగోస్లావ్ కమ్యూనిస్టు లీగ్ నాయకులు తమ లెనినిస్టు-వ్యతిరేక రివిజనిస్టు కార్యక్రమంతో 1957 ప్రకటనను ప్రతిఘటించారు; వారు యుగోస్లావ్ కమ్యూనిస్టు లీగును అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికంతటికీ వ్యతిరేకంగా నిలబెట్టారు; సోషలిస్టు శిబరంతో తమ దేశానికి గల సంబంధాలను తెంచుకొన్నారు; దానిని అమెరికా, తదితర సామ్రాజ్యవాదుల "సహాయం" పై ఆధారపడేట్లు చేశారు...."

పత్రంలో ఇంకా ఇలా ఉంది: "యుగోస్లావ్ రివిజనిస్టులు సోషలిస్టు శిబిరానికి, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి వ్యతిరేకంగా విచ్ఛిన్న చర్యలు కొనసాగిస్తున్నారు. వారు ఎక్స్ట్రా-బ్లాక్ విధానం అనే సాకుతో శాంతికాముక శక్తుల, శాంతికాముక దేశాలన్నిటి ఐక్యతకు హానికలిగించే కార్యకలా

పాలను చేబట్టారు."

అందుచేత, ఈ దిగువనిర్ణయం చేయబడింది. "యుగో స్లావ్ రివిజనిస్టు నాయకులను ఇంకా బట్టబయలు చేయడం, యుగోస్లావ్ రివిజనిస్టుల లెనినిస్టు వ్యతిరేక భావాలనుండి కమ్యూనిస్టు ఉద్యమాన్ని, కార్మికోద్యమాన్ని కాపాడటానికై గట్టి పోరాటం జరపడం మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీల ప్రధాన కర్తవ్యంగా ఉంది."

ఇక్కడ తలెత్తిన సమస్య, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ఒక ప్రధానమైన సిద్ధాంత సమస్య.

ఇటీవలనే టిటో ముఠా, ప్రకటనకు, పత్రానికి వ్యతిరేకమైన తమ రివిజనిస్టు కార్యక్రమాన్ని, మార్క్సిస్టు-లెనినిస్టు వ్యతిరేక వైఖరిని నిరాఘాటంగా అమలుజరప దలచినట్లు చాటి చెప్పింది.

అమెరికా సామ్రాజ్యవాదులూ, నాటో భాగస్వాములూ చాలా కాలంగా టిటోముఠాను మేపడానికి కొన్ని వందలకోట్ల అమెరికా డాలర్లు ఖర్చుపెట్టారు. "మార్క్సిస్టు-లెనినిస్టుల"నే ముసుగుతో "సోషలిస్టు దేశం" అని చెప్పుకొంటూ టిటోముఠా అంతర్జాతీయకమ్యూనిస్టు ఉద్యమాన్ని, ప్రపంచ ప్రజల విప్లవాశయాన్ని బలహీనపరుస్తున్నది; అమెరికా సామ్రాజ్య వాదానికి ఒక ప్రత్యేక సాధనంగా ఉపకరిస్తున్నది.

యుగోస్లావియా "నిర్దుష్టఅనుకూల వైఖరి"ని చూపెడుతున్నదని, అది "సోషలిస్టుదేశమ"ని టిటోముఠా "సామ్రా

జ్యవాద వ్యతిరేకశక్తి" అని బల్లగుద్ది చెప్పడం పూర్తిగా నిరాధారమైనది, వాస్తవానికి భిన్నమైనది.

కొందరు వ్యక్తులు ప్రస్తుతం యుగోస్లావ్ రివిజనిస్టు ముఠాను కమ్యూనిస్టు సమాజంలోకి, అంతర్జాతీయ కమ్యూనిస్టు కార్యకర్తల సమూహంలోకి ప్రవేశ పెట్టజూస్తున్నారు. ఇలా చేయడమంటే, 1960 లో సోదరపార్టీల సమావేశం ఏక గ్రీవంగా ఆమోదించిన ఒడంబడికను బహిరంగంగా చింపి వేయడమన్న మాట. ఇది ఏ మాత్రమూ అనుమతింపదగింది కాదు.

గత కొద్ది సంవత్సరాలుగా, అంతర్జాతీయ కార్మికవర్గ ఉద్యమాన్ని కలుషితం చేస్తున్న రివిజనిస్టు ధోరణి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం పొందిన అనేక అనుభవాలు' గుణపాఠాలు, ప్రస్తుతం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ముఖ్యమైన ప్రమాదం రివిజనిజమని ప్రకటన, పత్రంలో చేసిన నిర్ణయం సరి అయిందని పూర్తిగా ఋజువుపరచాయి.

అయినప్పటికీ, కొందరు వ్యక్తులు బహిరంగంగా, ముఖ్యమైన ప్రమాదం పిడివాదమేకాని రివిజనిజం కాదని, లేదా పిడివాదం రివిజనిజంకంటె తక్కువ ప్రమాదమైనదేమీ కాదని ఇంకా ఏవేవో చెబుతున్నారు; దీనికంతటికీ ఏ రకమైన సూత్రం వర్తిస్తుంది ?

నిలకడగల మార్క్సిస్టు - లెనినిస్టులు, చిత్తశుద్ధిగల మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలు సూత్రాలకు తొలి ప్రాధాన్యత ఇవ్వాలి. వారు నేడుఒకదానికి రేపు ఇంకోదానికి అంగీకరిస్తూ, నేడు ఒకదానిని రేపు ఇంకొకదానిని బలపరుస్తూ

సూత్రాలను తాకట్టు పెట్టకూడదు.

మార్క్సిస్టు-లెనినిస్టు లందరితో బాటు, చైనా కమ్యూనిస్టులు మార్క్సిజం-లెనినిజం యొక్క పవిత్రతను, ప్రకటన, పత్రంలోని సూత్రబద్ధమైన ఖరిని కాపాడే నిమిత్తం ఆధునిక రివిజనిజానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటం కొనసాగిస్తారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ముఖ్యమైన ప్రమాదంగా ఉన్న రివిజనిజాన్ని నిర్మూలిస్తూనే, కమ్యూనిస్టులు పిడివాదాన్ని కూడా నిర్మూలించాలి.

1 57 ప్రకటనలో పేర్కొన్నట్లు. శ్రామికవర్గపార్టీలు "విశ్వజనీనమైన మార్క్సిస్టు - లెనినిస్టు సత్యాన్ని తమదేశాలలో విప్లవంయొక్క, నిర్మాణంయొక్క నిర్దిష్ట ఆచరణతో మేళవించేసూత్రాన్ని గట్టిగా అమలు పరచాలి."

అంటే :

ఒకవైపున విశ్వజనీన మార్క్సిస్టు-లెనినిస్టు సత్యానికి ఎల్లప్పుడూ కట్టుబడి ఉండటం అవసరం. ఆ విధంగా చేయకపోతే, మితవాద అవకాశవాదానికి గాని రివిజనిస్టు తప్పులకు గాని దారితీస్తుంది.

మరోవైపున, వాస్తవ పరిస్థితులను బట్టే పని ప్రారంభించడం, ప్రజానీకంతో సన్నిహిత సంబంధం పెట్టుకోవడం ప్రజాపోరాటాల అనుభవాలను సమీక్షించడం, తమదేశ పరిస్థితులకు తగినట్లు విధానాలను ఎత్తుగడలను స్వతంత్రంగా రూపొందించుకోవడం వర్తింపజేయడం ఎల్లప్పుడూ అవసరం. ఆ విధంగా చేయకపోతే, మరో కమ్యూనిస్టుపార్టీ విధానాలను, ఎత్తుగడలను మక్కీకిమక్కీ అనుసరిస్తే, గ్రుడ్డిగా ఇతరుల

అభీష్టానికి లొంగిపోతే ఇతరకమ్యూనిస్టుపార్టి కార్యక్రమాన్ని తీర్మానాలను పరిశీలించకుండానే తమ పంథాగా అంగీకరిస్తే పిడివాద తప్పిదాలు జరుగుతాయి.

ప్రకటనలో చాలాకాలం క్రిందటే ధ్రువపరచిన ఈ మౌలిక సూత్రాన్ని కొందరు ప్రస్తుతం ఉల్లంఘిస్తున్నారు. "మార్క్సిజం - లెనినిజాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి పరుస్తున్నామ"నే సాకుతో, వారు మార్క్సిజం-లెనినిజంయొక్క విశ్వజనీన సత్యాన్ని త్రోసిపుచ్చుతున్నారు. పైపెచ్చు, స్వకపోల కల్పితాలనే "విశ్వజనీన మార్క్సిస్టు-లెనినిస్టుసత్యాలు" గా వర్ణిస్తున్నారు. తమ మనస్సులో పుట్టిన ఊహాలుతప్ప, వీటికి మరో ప్రాతిపదిక లేదు. ఇవివాస్తవానికి ప్రజలకు దూరమైనవి. ఈ స్వకపోల కల్పనలను బేషరతుగా అంగీకరించాలని వారు ఇతరులను వత్తిడి పెడుతున్నారు.

అందుచేతనే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అనేక తీవ్రపరిణామాలు ఏర్పడ్డాయి.

(24) విప్లవం యొక్క అభివృద్ధీ విజయమూ విప్లవ శ్రామికవర్గ పార్టి ఉనికిపైనే ఆధారపడి ఉందనేది అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానుభవం నేర్పుతున్న అతిప్రధానమైన గుణపాఠం.

విప్లవపార్టి ఒకటి ఉండాలి.

మార్క్సిజం-లెనినిజంయొక్క విప్లవసిద్ధాంతం, విప్లవ పద్ధతికి అనుగుణంగా నిర్మింపబడిన విప్లవపార్టి ఒకటిఉండాలి.

మార్క్సిజం - లెనినిజంయొక్క విశ్వజనీన సత్యాన్ని

తమ దేశంలో నిర్దిష్ట ఆచరణతో మేళవించగల విప్లవపార్టి ఒకటి ఉండాలి.

వాస్తవంపట్ల శ్రద్ధాసక్తులుచూపే, తనతప్పులను సరి చేసుకొనే, విమర్శ, ఆత్మవిమర్శలను ఎలాజరపాలో తెలుసు కొనే విప్లవపార్టీ ఒకటి ఉండాలి.

ఇలాంటి విప్లవపార్టీమాత్రమే సామ్రాజ్యవాదాన్ని, దాని తాబేదార్లను ఓడించడంలో శ్రామికవర్గానికీ, విశాల మైన ప్రజానీకానికి నాయకత్వం వహించగలదు. జాతీయ ప్రజాస్వామిక విప్లవంలో సంపూర్ణవిజయం సాధించగలదు. సోషలిస్టువిప్లవాన్ని సాధించగలదు.

ఒకపార్టీ శ్రామికవర్గవిప్లవపార్టీకాకుండా, బూర్జువా సంస్కరణవాదపార్టీఅయితే ;

అది మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీ కాకుండా, రివిజనిస్టు పార్టీఅయితే ;

అది శ్రామికవర్గం అగ్రగామిపార్టీకాకుండా, బూర్జువా వర్గంవెంట, దాని తోక బుచ్చుకువెళ్లే పార్టీఅయితే ;

అది శ్రామికవర్గయొక్క, కార్మికప్రజలందరియొక్క ప్రయోజనాలకు ప్రాతినిధ్యంవహించేపార్టీకాకుండా, కార్మిక ప్రభువుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యంవహించే పార్టీఅయితే;

అది అంతర్జాతీయ తత్వంగల పార్టీకాకుండా, జాతీయ తత్వంగలపార్టీఅయితే ;

అది తీవ్రమైనపరిశోధన, పరిశీలనద్వారా తన స్వదేశ ములో వేర్వేరువర్గాల ధోరణులనుగూర్చి స్వయంగా ఆలో

చించి సరిఅయిన అంచనాకు రావడానికై తనబుర్రను ఉపయో గించగలపార్టీ కాకుండా, మార్క్సిజం-లెనినిజంయొక్క విశ్వ జనీన సత్యాన్ని స్వదేశంలో నిర్దిష్టఆచరణకు ఎలావర్తింప జేయడం తెలిసిన పార్టీ కాకుండా, ఇతరులమాటలను చిలుకపలె వల్లించేపార్టీఅయితే, పరిశీలనచేయకుండా విదేశఅనుభవాన్ని మక్కీకిమక్కీ అనుసరించేపార్టీఅయితే, విదేశాలలో కొందరు వ్యక్తుల ఆజ్ఞానుసారం అటూఇటూ పరుగులెత్తేపార్టీఅయితే, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతంమినహా రివిజనిజం, పిడివాదం వగైరా అమాంబాపతుకు ఆలవాలంగా తయారయ్యేపార్టీ అయితే ;

అలాంటిపార్టీ ఎప్పటికీ విప్లవపోరాటంలో శ్రామిక వర్గానికీ, ప్రజానీకానికి నాయకత్వం వహించలేదు, విప్ల వాన్ని ఎప్పటికీ సాధించలేదు, శ్రామికవర్గంయొక్క చారి త్రక ఆశయాన్ని ఎప్పటికీ నెరవేర్చలేదు.

మార్క్సిస్టు-లెనినిస్టులందరు, వర్గచైతన్యంగలకార్మికు లందరు, సర్వత్రా గలఅందరు అభ్యుదయకాముకులు లోతుగా ఆలోచించివలసిన సమస్య ఇది.

(25) అంతర్జాతీయకమ్యూనిస్టుఉద్యమంలో తలెత్తిన భేదాభిప్రాయాలను గౌరవిస్తూనే, వాస్తవమేదో, అవాస్తవ మేదో వేరుచేసిచూడటం మార్క్సిస్టు - లెనినిస్టులకర్తవ్యం. శత్రువుకు వ్యతిరేకంగా పోరాడటంకోసం ఐక్యతఅవసరమనే ఉమ్మడి ప్రయోజనందృష్ట్యా, సమస్యలను పార్టీఆంతరంగిక చర్చలద్వారా పరిష్కరించుకోవాలని మేముఎల్లప్పుడూ వాది

స్తూవచ్చాం, భేదాభిప్రాయాలను బహిరంగంగా శత్రువు ఎదుటికి తేవడాన్ని మేము ఎల్లప్పుడూ వ్యతిరేకిస్తూవచ్చాం.

కొందరు సోదరపార్టీ నాయకులు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో బహిరంగవాదోపవాదాలను రెచ్చగొట్టారని, మాపై బలవంతంగా రుద్దారని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కామ్రేడ్స్‌కు తెలిసేఉంది.

బహిరంగచర్చను రెచ్చగొట్టారు కాబట్టి సోదరపార్టీల మధ్య సమానత్వ ప్రాతిపదికపైన, ప్రజాస్వామ్య ప్రాతిపదికపైన దీనిని నిర్వహించవలసిఉంది. వాస్తవాలను ముందుపెట్టడం ద్వారా, విషయాలను సోదాహరణంగా రుజువుపరచడం ద్వారా దీనిని నిర్వహించవలసిఉంది.

ఇతరసోదరపార్టీలను కొందరుపార్టీనాయకులు బహిరంగంగాదాడిచేసి బహిరంగచర్చను రెచ్చగొట్టారు కాబట్టి, దాడికిగురిఅయిన సోదరపార్టీలు బహిరంగసమాధానాలు ఇవ్వకుండా వారు నిషేధించడానికి కారణంగాని అధికారంగాని లేదని మా అభిప్రాయం.

ఇతరసోదరపార్టీలపై దాడిచేస్తూ లెక్కలేనన్ని వ్యాసాలు ప్రచురించారుకాబట్టి, అందుకు సమాధానంగా ఆ సోదర పార్టీలు వ్రాసినవ్యాసాలను తమ స్వంతపత్రికలలో ఎందుకు ప్రచురించడంలేదు ?

ఇటీవలకొంతకాలంగా, చైనాకమ్యూనిస్టుపార్టీ హాస్యాస్పదమైన దాడులకు గురిఅవుతున్నది. దాడిచేసేవారు పెద్ద అల్లరి లేవదీశారు. వాస్తవాలను పరిగణించకుండా, మాకు

వ్యతిరేకంగా ఎన్నో నేరాలను సృష్టించారు. మాపై దాడిచేసే ఈవ్యాసాలను, ప్రసంగాలను మాస్వంతపత్రికలలో ప్రచురించాం.

అంతేకాదు. సుప్రీంసోవియట్ సమావేశంలో 1962 డిసెంబరు 12వ తేదీన సోవియట్‌నాయకుడు ఇచ్చినని వేదికను, 1963 జనవరి 7వ తేదీన ప్రావ్దాసంపాదకవర్గం వ్రాసిన వ్యాసాన్ని, జర్మనీ సోషలిస్టుయూనిటీపార్టీ ఆరో మహాసభలో 1963 జనవరి 16వ తేదీన సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధివర్గనాయకుడు చేసినప్రసంగాన్ని, 1963 ఫిబ్రవరి 10వ తేదీన ప్రావ్దాసంపాదకవర్గంవ్రాసిన వ్యాసాన్ని మా పత్రికలలో పూర్తిగా ప్రచురించాం.

సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ 1963 ఫిబ్రవరి 21వ తేదీన, మార్చి 30వ తేదీన వ్రాసినరెండు లేఖలనుకూడ మేముపూర్తిగా ప్రచురించాం.

సోదరపార్టీలు మాపైదాడిచేస్తూ వ్రాసినవ్యాసాలు, చేసినప్రసంగాలలో కొన్నిటికి మేము సమాధానాలు ఇచ్చాం; తక్కినవాటికి మేము ఇంకాసమాధానం ఇవ్వలేదు. ఉదాహరణకు, సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కామ్రేడ్స్ వ్రాసిన ఎన్నోవ్యాసాలకు, చేసిన ప్రసంగాలకు మేము ప్రత్యక్షంగా సమాధానం ఇవ్వలేదు.

1962 డిశంబరు 15, 1963 మార్చి 8 తేదీలమధ్య— మాపైదాడిచేసినవారికిసమాధానంగా – మేము ఏడువ్యాసాలు వ్రాశాం. అవి ఈదిగున శీర్షికలతో వెలువడ్డాయి :

“ ప్రపంచ కార్మికులారా, ఏకంకండి, మన ఉమ్మడి శత్రువును వ్యతిరేకించండి ! ”,

“ కామ్రేడ్ టోగ్లియాటీకి, మాకూ మధ్య భేదాభిప్రాయాలు ”,

“ లెనినిజం, ఆధునిక రివిజనిజం ”,

“ మాస్కో-ప్రకటన, మాస్కో-పత్రం ప్రాతిపదికపై ఐక్యమవుదాం ”,

“భేదాభిప్రాయాలు ఎప్పటినుండి?— థోరే, తదితర కామ్రేడ్స్‌కు సమాధానం”,

“కామ్రేడ్ టొగ్లియాటీకి, మాకు మధ్యభేదాభిప్రాయాలనుగూర్చి మరికొంత వివరణ-సమకాలిక ప్రపంచంలో లెనినిజానికి సంబంధించిన కొన్నిప్రధాన సమస్యలు”,

“అమెరికాకమ్యూనిపార్టీ ప్రకటనపై వ్యాఖ్య”.

మార్చి 30 తేదీన మీ లేఖచివర, సోవియట్‌యూనియన్‌కమ్యూనిస్టుపార్టీపై చైనాపత్రికలు “నిరాధారమైన దాడులు” చేస్తున్నాయని మీరు నిందించారంటే, ఈవ్యాసాలను దృష్టిలోపెట్టుకొనే నిందించారని ఊహించవలసివస్తున్నది. మాపై దాడిచేసినవారికి సమాధానంగా వ్రాసిన వ్యాసాలను “దాడులు”గా వర్ణించడం విషయాలను తల్లకిందులు చేయడమే.

మావ్యాసాలు “ నిరాధారమైనవని ”, చాలా చెడ్డవని మీరు వర్ణిస్తున్నారుకాబట్టి, మేము మీవ్యాసాలను ప్రచురించినట్లే ఈ ఏడు“నిరాధారమైనదాడుల”న్నిటినీ మీరు

కూడ ప్రచురించి, ఒప్పేవరిదో తప్పేవరిదో స్వయంగా ఆలోచించడానికి పరిశీలించడానికి సోవియట్ కామ్రేడ్స్‌కు, సోవియట్ ప్రజలకు అవకాశం ఎందుకు ఇవ్వకూడదు? "నిరాధారమైనదాడుల"ని మీరు లెక్కిస్తున్న ఈవ్యాసాలలో ఒక్కొక్క అంశాన్నే తీసుకొని దుయ్యబట్టే హక్కు మీకు ఉండనే ఉందిగదా.

మావ్యాసాలు "నిరాధారమైనవ"ని, మావాదనలు తప్పుఅని మీరు పేర్కొంటున్నప్పటికీ, వాస్తవంలో మా వాదనలేవో మీరు సోవియట్ ప్రజలకు చెప్పడంలేదు. ఇది సోదరపార్టీలు లేవదీసిన సమస్యలను చర్చించడంపట్లగాని, వాస్తవంపట్లగాని, ప్రజానీకంపట్లగాని తగుశ్రద్ధాసక్తులు చూపించేపద్ధతి అని బొత్తిగా అనిపించుకోదు.

సోదరపార్టీలమధ్య బహిరంగ వాదోపవాదాలను కట్టిపెట్టగలరని మేము ఆశిస్తున్నాం. స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరపార్టీలమధ్య సంప్రతింపులద్వారా ఏకాభిప్రాయాన్ని సాధించడం అనే సూత్రాలను అనుసరించి పరిశీలింపదగిన సమస్యఇది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో, ఎవరికీ తన ఇష్టంవచ్చినప్పుడు దాడులు ప్రారంభించే అధికారంగాని, రెండోపక్షంవారు సమాధానం ఇవ్వకుండా నిరోధించడానికై తనఇష్టంవచ్చినప్పుడు "బహిరంగ వాదోపవాదాలను అంతం చేయాలని" ఉత్తర్వుఇచ్చే అధికారంగాని లేదు.

సోదరపార్టీల సమావేశాన్ని ఏర్పాటుచేయడానికి తగు

వాతావరణాన్ని సృష్టించేనిమిత్తం, సోదరపార్టీల కామ్రేడ్స్ మాకు వ్యతిరేకంగా మాపేరెత్తి, మమ్మల్ని ఉద్దేశించి చేసిన బహిరంగదాడులకు బహిరంగసమాధానాలు ఇవ్వడం 1963 మార్చి 9వ తేదీనుండి మేము తాత్కాలికంగా ఆపుజేయ నిశ్చయించామనేవిషయం సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కామ్రేడ్స్‌కు తెలిసేఉంది. బహిరంగసమాధానం ఇచ్చే హక్కును మేము అట్టిపెట్టుకొంటున్నాం.

మేము మార్చి 9వ తేదీవ్రాసిన లేఖలో, బహిరంగ వాదోపవాదాలను రద్దుచేసే సమస్యనుగూర్చి ఇలాచెప్పాం: "మన ఉభయపార్టీలు, ఇందుకుసంబంధించిన సోదరపార్టీలు కొంతచర్చజరిపి, సర్వులకూ సమ్మతమైన, ఆమోదకరమైన ఒడంబడికకురావడం అవసరం."

★

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సాధారణ పంథానుగూర్చి, అందుకు సంబంధించిన సిద్ధాంతసమస్యలను గూర్చి మా అభిప్రాయాలను పైనపేర్కొన్నాం. ఈ లేఖ ప్రారంభంలో మేము సూచించినట్లు, మన అభిప్రాయాలను నిర్మొగమాటంగా వెల్లడించుకోవడం పరస్పర అవగాహనకు తోడ్పడగలదని మేము ఆశిస్తున్నాం. కామ్రేడ్స్ ఈ అభిప్రాయాలతో ఏకీభవించనూవచ్చు, ఏకీభవించకపోనూ వచ్చు. అయితే, మేము ఇక్కడ చర్చిస్తున్నసమస్యలు అంత

ర్జాతీయకమ్యూనిస్టు ఉద్యమం ఎలుగెత్తి చాటుతున్న, పరిష్కారయోగ్యమైన కీలకసమస్యలని మాఅభిప్రాయం. ఈసమస్యలను, అలాగే మీలేఖలో లేవదీసిన సమస్యలను అన్నిటిని గూర్చి మన ఉభయపార్టీల సంభాషణలలోను, అన్నిసోదర పార్టీల ప్రతినిధుల సమావేశంలోను పూర్తిగా చర్చించగలరని మేము ఆశిస్తున్నాము.

అంతేకాదు. అందరికీ సంబంధించిన ఇతరసమస్యలు, అంటేస్టాలిన్‌పై విమర్శ, అంతర్జాతీయకమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించిన కొన్నిప్రధానమైన సిద్ధాంతసమస్యలు ఉన్నాయి. సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభ, 22వ మహాసభలలో వీటినిలేవదీశారు. ఈసమస్యలపైకూడ సంభాషణలలో ఒకరిఅభిప్రాయాలను ఒకరు నిర్మొగమాటంగా వెల్లడించగలరని మేము ఆశిస్తున్నాం.

మనఉభయపార్టీలమధ్య సంభాషణలనుగూర్చి, మేము 9వ తేదీ వ్రాసినలేఖలో, కామ్రేడ్ కృశ్చేవ్ పెకింగ్‌కు రావాలని మేము ప్రతిపాదించాం; ఇది అనుకూలంగా లేకపోతే, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీలో బాధ్యతగల మరొక కామ్రేడ్‌నాయకత్వాన పెకింగుకు ఒక ప్రతినిధివర్గాన్ని పంపాలని, లేదా మేము మాస్కోకు ఒక ప్రతినిధివర్గాన్ని పంపగలమని ప్రతిపాదించాం.

మీరు మార్చి 30వ తేదీవ్రాసినలేఖలో కామ్రేడ్ కృశ్చేవ్ చైనాకు రాజాలరని చెప్పారుకాబట్టి, చైనాకు ఒక

ప్రతినిధివర్గాన్ని పంపేవాంఛఉన్నట్లు మీరు వెల్లడించలేదు కాబట్టి, చైనాకమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఒకప్రతినిధి వర్గాన్ని మాస్కోకు పంపనిశ్చయించింది.

మీరు మార్చి 30వ తేదీవ్రాసినలేఖలో, సోవియట్ యూనియన్‌ను సందర్శించవలసిందిగా మీరు కామ్రేడ్ మావో సేటుంగ్‌ను ఆహ్వానించారు. ఫిబ్రవరి 23 ప్రాంతంలోనే, కామ్రేడ్ మావోసేటుంగ్ చైనాలో సోవియట్ రాయబారితో జరిపిన సంభాషణలో, ప్రస్తుతం తాను సోవియట్ యూనియన్‌ను సందర్శించడానికి ఎందుకు సిద్ధంగాలేరో తెలియజేశారు. మీకు ఈ విషయం బాగా తెలుసు.

చైనాకమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీలో బాధ్యతగల ఒకకామ్రేడ్ మార్చి 9వ తేదీ చైనాలో సోవియట్ రాయబారికి స్వాగతంచెప్పిన సందర్భంలో, జూన్ మధ్యభాగంలో మేము ఒకప్రతినిధివర్గాన్ని మాస్కోకు పంపుతామని మీకు తెలియజేశారు. తర్వాత, సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థనను అనుసరించి, మేము మనఉభయపార్టీలమధ్య సంభాషణలను జూలై 5వ తేదీకి వాయిదా వేయడానికి అంగీకరించాం.

చైనా, సోవియట్‌పార్టీలమధ్య సంభాషణలవల్ల అనుకూల ఫలితాలుకలుగగలవని, అన్ని కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీల సమావేశం ఏర్పాటుకు సన్నాహాలు చేసుకునేందుకు ఇదితోడ్పడగలదని మేముహృదయపూర్వకంగాఆశిస్తున్నాం.

మార్క్సిజం-లెనినిజం, శ్రామికవర్గ అంతర్జాతీయత, సోదరపార్టీలు ఏకగ్రీవంగా ఆమోదించిన ప్రకటన, పత్రాల ప్రాతిపదికపై కమ్యూనిస్టులందరూ ఐక్యంకావడం మునుపు, ఎన్నడూలేనంతగా ఇప్పుడు అవసరం.

మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీలతో ప్రపంచమంతటాగల విప్లవప్రజలతోకలిసి చైనాకమ్యూనిస్టుపార్టీ సోషలిస్టుశిబిరం యొక్క, అంతర్జాతీయ కమ్యూనిస్టుఉద్యమంయొక్క ప్రయోజనాలను, పీడితప్రజల, పీడిత దేశాలయోగక్షేమాలను కాపాడటానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటంజరపడానికి, ప్రపంచశాంతిరక్షణకు నిర్విరామకృషి కొనసాగిస్తుంది.

మనకు సన్నిహితులు, అభిమానపాత్రులు అయినవారికి దుఃఖంకలిగించి, శత్రువుకుమాత్రమే సంతోషం కలిగించే ఘటనలు భవిష్యత్తులో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో పునరావృతం కాబోవని మేము ఆశిస్తున్నాం.

మార్క్సిస్టు-లెనినిస్టులు, శ్రామికవర్గం, సర్వత్రాగల విప్లవప్రజానీకం మరింతసన్నిహితంగా ఐక్యంకాగలరని, అన్ని కష్టాలను, అడ్డంకులను అధిగమించి సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, ప్రపంచశాంతికోసం జరిగేపోరాటంలో, ప్రపంచ ప్రజల విప్లవాశయంకోసం, అంతర్జాతీయ కమ్యూనిజంకోసం జరిగేపోరాటంలో ఇంకా గొప్పవిజయాలు సాధించగలరని

చైనాకమ్యూనిస్టులు గట్టిగా విశ్వసిస్తున్నారు.

అన్నిదేశాల కార్మికులారా, ఏకంకండి! ప్రపంచ కార్మికులారా, పీడితప్రజలారా, జాతులారా, ఏకంకండి! మనఉమ్మడి శత్రువును ఎదిరించండి!

కమ్యూనిస్టు అభివందనాలతో,

చైనాకమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటి.



ప్రచురణ నెం. 8 BC వెల 0–60

## మా నూతన ప్రచురణలు

1. మాస్కో ప్రకటన, మాస్కో పత్రం ప్రాతిపదికపై ఐక్యమవుదాం లెనినిజం--ఆధునిక రివిజనిజం 0–25
2. రాబందుల రాజ్యం 1–25
   అనువాదం : మోటూరు హనుమంతరావు

---

ప్రతులకు :—

మార్క్సిస్టు ప్రచురణలు
మెయిన్‌రోడ్ : తెనాలి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA113B197 |
| పుస్తకం పేరు | సోవియట్ పార్టీ లేఖకు చైనా కమ్యూనిస్టు పార్టీ జవాబు |
| తారీఖు | 11 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | C1, 13C1 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | Lakchmi |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |